హాఽన్త్యయం గే కలిః
పోటగళే రాజ
కపినాయకే. ౩౯౧
రాశౌ పలశతే సా
పృ న్మానసాధనే,
ద్వారాన్త రేఖాణ్డే
ఽవజ్ఞావిలాసయోః.
తు స్కన్ధశాఖా
గేహ గేహైకదేశ

ర్వళీ చా ప్యుదరరే
మరదణ్డయోః. ౩౯౩.
దారువిశేషే చ జరా
ర్మణి,

కేళి ర్విలాసశ్చ
రప్రభవా క్రియా.
ః కర్ణలతాగ్రే చ ప్ర
శ్రీ పఙ్క్తిషు,
దేచయా కాయాం
శ్మశ్రుయోషితి.
౩౯౪

ళీతు స్సఖీ పఙ్క్తిః
ల్పగ్రామకే కుటౌ,
బ్ధి తీరాబ్ధివృద్ధ్యోః
ర్యాదయో రపి.
౩౯౫
రన్ధ్రే గుహాయాఞ్చ
మున్మాన మాంస

సీరోపకరణే కా
పనే వ్య
౯౭. గేహే దే

కలిః-॥పు॥ ఇది కలహమునకును, కలియుగమునకును పేరు.

నలః-॥పు॥ ఇది గనపదంటునకును, కసవునకును, నళమహారాజునకును నలుఁడను వానరసేనాపతికిని పేరు.

తులా-॥స్త్రీ॥ ఇది రాశిభేదమునకును, నూఱుపలములయెత్తునకును, ఉపమానమునకును, త్రాసునకును, గృహద్వారమధ్యభాగమునకును, గోనెకడవ మొదలయిన వస్తువులకును పేరు.

హేలా-॥స్త్రీ॥ ఇది అవమానమునకును, విలాసమునకును పేరు.

శాలా-॥స్త్రీ॥ ఇది వృక్షముల మొదటికొమ్మకును, గృహమునకును, గృహభేదమునకును పేరు.

వళిః-వళీ-ఈరెండును కడుపుమడతలకును, చామరదండమునకును, ఇంటిపంచమోపునకును, ముదిమిచే వదలిన దేహమునందలి చర్మమునకును పేరు.

లీలా-॥స్త్రీ॥ ఇది క్రీడకును, విలాసమునకును, శృంగార రసమువలనం బుట్టిన క్రియాభేదమునకును పేరు.

పాళిః-॥స్త్రీ॥ ఇది చెవితమ్మెకును, ప్రదేశమునకును, చిహ్నమునకును, అంచునకును, పఙ్క్తికిని, కత్తిపిడిమూఁతకును, పేనుకును, మీసముగల స్త్రీకిని పేరు.

ఆళిః-॥స్త్రీ॥ ఇది కట్టకును, చెలికత్తెకును, పఙ్క్తికిని పేరు.

పల్లీ-॥స్త్రీ॥ ఇది అల్పగ్రామమునకును, కొద్దిగృహమునకును పేరు.

వేలా-॥స్త్రీ॥ ఇది చెల్లెలికట్టకును, సముద్రముపొంగుటకును, కార్యోచితకాలమునకును, మర్యాదకును, అపిశబ్దమువలన రాజభోజనమునకును, అనాయాసమరణమునకును పేరు.

బిలమ్-॥న॥ ఇది రంధ్రమునకును, పర్వతగుహకును పేరు.

పలమ్-॥న॥ ఇది పదివరహాలయెత్తునకును, మాంసమునకును పేరు.

ఫాలమ్-॥న్న॥ ఇది కఱ్ఱునకును, ప్రత్తికిని, ముఖమునకును పేరు.

కులమ్-॥న॥ ఇది గృహమునకును, దేహమునకును, దేశమున

హే జనపదే సజాతీయ గ
ణేఽన్వయే, కులం

కునుం, సజాతీయమైన ప్రాణిసమూహమునకును, వంశమునకును పేరు.

కూలం తు సేనాయాః
పృష్ఠే సూదేచ రోధసి.

కూలమ్-॥న॥ ఇది సేనాపృష్ఠభాగమునకును, వంటవానికిని, గట్టునకును పేరు.

మూల మాదౌ శిఫాయాం
చ సమీపే తారకాన్తరే,

మూలమ్-॥న॥ మొదటికిని, ఊడకును, సమీపమునకును, నక్షత్రవిశేషమునకును పేరు.

జాలం జాలక మిత్యేతౌ
గవాక్షా నాయయోర్గణే
దమ్భ కుట్మలయోశ్చాథ

జాలమ్-జాలకమ్-॥న॥ ఈరెండును, గవాక్షికిని, వలకును, సమూహమునకును, డంభమునకును, మొగ్గలకును పేరు.

శీలం వృత్తిస్వభావయోః,

శీలమ్-॥న॥ ఇది మంచినడతకును, స్వభావమునకును పేరు.

సైన్యాస్థి రూపరేత స్స్థా
ల్యశ్శక్తిషు చే ద్బలంక్లీబే.
౮౦౦. వాట్యాలకే స్త్రి
యాం త్రిషు బలవతి నా
సీరిదైత్య కాకేషు,

బలమ్-ఇది సేనకును, ఎముకకును, రూపమునకును, రేతస్సునకును, బలిసియుంటకును, సత్తువకును పేరగునపుడు ॥న॥ చిట్టాముదపుచెట్టునకు పేరగునపుడు ॥స్త్రీ॥ బలవంతునికి పేరగునపుడు ॥త్రి॥ బలరామునికిని,బలాసురునకును, కాకికిని పేరైనపుడు ॥పు॥

ఫల మిష్వగ్రే సస్యే ఫ
లకే జాతిఫలే ధనే ఫాలే.
౮౦౧. భోగబీజే లాభ
హేతూత్పన్నే ఫలీతు ఫలినీ
స్యాత్,

ఫలమ్-॥న॥ ఇది బాణముయొక్క కొనకును, పైరునకును, కేడమునకును, జాజిఫలమునకును, ధనమునకును, నొసటికిని, భోగమునకును, విత్తునకును, లాభమునకును, హేతువువలనం బుట్టిన ప్రయోజనమునకును పేరు. ప్రేంకణపుచెట్టునకు పేరగునపుడు ఫలీ ॥స్త్రీ॥

దళః ఖణ్డే దళం పర్ణే

దళః-ఇది తునుకకు పేరగునపుడు ॥పు॥ ఆకునకు పేరగునపుడు ॥న॥

జలం నీరే జడే త్రిషు.
౮౦౨

జలమ్-ఇది ఉదకమునకు పేరగునపుడు ॥న॥ జడునకు పేరగునపుడు ॥త్రి॥

తలం స్వరూపాధరయో
రస్త్రీ తాళతరౌ పుమాన్,
క్లీబే చపేటే జ్యాఘాత
వారణే సమభూతలే. ౮౦౩

తలమ్-ఇది స్వరూపమునకును, క్రిందికిని పేరగునపుడు ॥న్న॥ తాటిచెట్టునకు పేరగునపుడు ॥పు॥ అఱచేతిదెబ్బకును, నారిదెబ్బతగులకుండునటులం జేతగట్టుకొనెడితోలునకును, సమభూమికిని పేరగునపుడు ॥న॥

వ్రీహ్యాద్యాఘట్టన స్థానే
ఖలో ధూర్తేత్వయం త్రిషు

ఖలమ్-ఇది కళ్లమునకు పేరగునపుడు ॥పు॥ మోసగానికి పేరగునపుడు ॥త్రి॥

తాలః కాల క్రియామానే
కరాస్ఫాలే ద్రుమాన్తరే.

తాలః-ఇది కాలమునకును, హస్తాకుంచనప్రసారణాదిక్రియకును, కలగియున్న ప్రమాణమునకును, చేతులుదట్టుటకును

స్యా ద్విస్తృతాభ్యా మంగుష్ఠమధ్యమాభ్యాం మితావపి, త్సరౌ కరతలే చాపి తాలంచ హరితాలకే ౪౦౫

తాటిచెట్టునకును, నడిమివ్రేలితోకూడి పఱుపఁబడి పెనువ్రేలి చేత కొలువఁబడినకొలతకును, కత్తిపిడికిని, హస్తప్రదేశమునకును పేరగునపుడు ॥పు॥ హరిదళమునకు పేరగునపుడు ॥న॥

కాలో౽నేహా యమో మృత్యు శ్శ్యామో నా తద్వతి త్రిషు, కాలాతు కృష్ణత్రివృతే నీలిన్యాం కృష్ణజీరకే. ౪౦౬

కాలః-ఇది కాలమునకును, యమునకును, మృత్యువునకును, నలుపునకును పేరగునపుడు ॥పు॥ నల్లనివస్తువునకు పేరగునపుడు ॥త్రి॥ నల్లతెగడకును, నీలిచెట్టునకును, నల్లజీలకఱ్ఱకును పేరగునపుడు ॥స్త్రీ॥

కాళీ నవాంబుదశ్రేణ్యాం భవానీ మాతృభేదయోః,

కాళీ - ॥స్త్రీ॥ ఇది నూతనమేఘపఙ్క్తికిని, గౌరికిని, కాళికాశక్తికిని నామము.

మాల మున్నతభూ ర్మాలా పఙ్క్తౌ పుష్పాదిదామని. ౪౦౭

మాలమ్-ఇది ఉన్నతభూమికి పేరగునపుడు ॥న॥ పఙ్క్తికిని, పుష్పములు మొదలైనవానిదండకును పేరగునపుడు ॥స్త్రీ॥

ఉఖాయాం పాటలాయాంచ స్థాలీ

స్థాలీ-॥స్త్రీ॥ ఇది కుండకును, కలిగొట్టుచెట్టునకును పేరు.

స్థాలంతు భాజనే,

స్థాలమ్-॥న॥ ఇది భోజనపాత్రకు పేరు.

వ్యాళ స్సర్పే దుష్టగజే శ్వాపదే నా శఠే త్రిషు

వ్యాళమ్-ఇది సర్పమునకును, దుష్టగజమునకును, దుష్టమృగమునకును పేరగునపుడు ॥పు॥ దుష్టునకు పేరగునపుడు ॥త్రి॥

చేలం వస్త్రే బర్హిచంద్రే త్రిషు త్వథ మనిన్ద్యయోః,

చేలమ్-ఇది వస్త్రమునకును, నెమలిపురికన్నునకును పేరగునపుడు ॥న॥ అసమర్థునికిని, నిందింపఁదగినవానికిని పేరైనపుడు ॥త్రి॥

పిప్పలీ చవ్యయోః కోలం సూకరోడుపయోః పుమాన్. ౪౦౮

కోలమ్-ఇది పిప్పలికిని, చవ్యమునకును పేరగునపుడు ॥న॥ అడవిపందికిని, తెప్పకును పేరగునపుడు ॥పు॥

శైలీ రీత్యాం

శైలీ-॥స్త్రీ॥ ఇది రీతికి పేరు.

గిరౌ శైల శ్శైలేయే తు నపుంసకమ్,

శైలః-ఇది పర్వతమునకు పేరగునపుడు ॥పు॥ జాతిపువ్వునకు పేరగునపుడు ॥న॥

నీలః కపీశే౽ద్రిభేదే కృష్ణే నా తద్వతి త్రిషు.

నీలః-ఇది కపిసేనానాయకునకును, పర్వతభేదమునకును, నలుపునకును పేరగునపుడు ॥పు॥ నలుపుగలదానికి పేరగునపుడు ॥త్రి॥

నీలిన్యాం నీలఝింట్యాం

నీలీ-॥స్త్రీ॥ ఇది నీలిచెట్టునకును, నల్లపువ్వులగోరింటకును పేరు.

| | |
|---|---|
| చ నీలీ | |
| నీలాతు మక్షికా, | నీలా - ॥స్త్రీ॥ ఇది ఈఁగెలకును పేరు. |
| శూల మస్త్ర్యాయుధేరోగే స్యా ద్దుష్టహననకీలకే. ౪౧౧ ఉపరాగాదిదోషే చ శూలా పణ్యాఙ్గనా భవేత్, | శూలమ్-ఇది ఆయుధవిశేషమునకును, శూలరోగమునకును, దుష్టులంగొఱతవేయుం మేకునకును, గ్రహణము మొదలైన దోషములకును పేరగునపుడు ॥పు॥ వేశ్యాస్త్రీకి పేరగునపుడు ॥స్త్రీ॥ |
| బ్రహ్మదారుణి తు క్లీబే తూలాం తూలస్తు నాపిచౌ. | తూలమ్-ఇది గంగరావిచెట్టునకు పేరగునపుడు ॥న॥ దూదికి పేరగునపుడు ॥పు॥ |
| వాలః కచేఽశ్వాదిపుచ్ఛే హ్రీబేరేతు నపుంసకమ్, | వాలః-ఇది తలవెండ్రుకలకును, గుఱ్ఱము మొదలైనవాని తోఁకకును పేరగునపుడు ॥పు॥ కురువేరునకు పేరగునపుడు ॥న॥ |
| మల్లో దృఢాఙ్గ పుంజాతౌ మత్స్యపాత్ర కపోలయోః. శ్లేష్మేతు త్రిషు | మల్లః-ఇది దృఢాంగుఁడైన పురుషునికిని, మత్స్యములబుట్టకును, చెక్కిలికిని పేరైనపుడు ॥పు॥ శ్లేష్మునికి పేరైనపుడు॥త్రి॥ |
| మల్లీ తు మృత్పాత్ర తృణ శూల్యయోః, | మల్లీ - ॥స్త్రీ॥ ఇది మంటితోఁజేసిన భోజనపాత్రకును, మల్లెచెట్టునకును పేరు. |
| భల్లో భల్లూకవాచీ స్యా | భల్లః - ఇది ఎలుఁగుగొడ్డునకు పేరగునపుడు ॥పు॥ |
| ద్భల్లా భల్లీచ సాయకే. | భల్లా-భల్లీ-ఈరెండును బాణవిశేషమునకు పేరగునపుడు॥స్త్రీ॥ |
| క్లిన్నాక్షే స్యు శ్చుల్లచిల్ల పిల్లాః క్లిన్నేఽక్ష్ణి చాప్యమీ, | చుల్లః-చిల్లః-పిల్లః - ॥త్రి॥ ఈ 3 శబ్దములును, తడిసిన కన్నులుగలవానికిని, తడిసినకంటికిని పేరు. |
| ఆతాయివాచీ చిల్లో నా | చిల్లః - ॥పు॥ ఇది డేగ ... కాకికిని పేరు. |
| స్త్రీతు చుల్ల్యన్తికా భవేత్. ౪౧౨ | చుల్లీ - ॥స్త్రీ॥ ఇది పొయిసందునకు పేరు. |
| జ్వాలే స్థాణౌ ద్వయోః కీల శ్శఙ్కు- శఙ్కరయోః పుమాన్, | కీలః - ఇది అగ్నిజ్వాలకును, మోటుచెట్టునకును పేరగునపుడు ॥ద్వి॥ మేకునకును, శివునకును పేరగునపుడు ॥పు॥ |
| నాళం తు నస్త్రియాం కాణ్డే క్లీబే వివరశేఫసోః | నాళమ్-ఇది కాఁడకు పేరైనపుడు ॥పున్న॥ రంధ్రమునకును, శిశ్నమునకును పేరైనపుడు ॥న॥ |
| శిల ముఞ్ఛం | శిలమ్ - ॥న॥ ఇది మడిలోరాలిన యెన్నుల దెచ్చికొని బ్రతుకుటకు పేరు. |

| | |
|---|---|
| ర్ణాపదీ భవేత్, | శిలీ - ॥స్త్రీ॥ ఇది ఆడయెఱ్ఱకు పేరు. |
| మధుని తక్రే లే | బోలమ్ - ఇది నేతితోఁగలిసిన తేనెకును, తక్రాలమను |
| బోలోఽంభసాం | గ్రంథ్యద్రవ్యమునకును పేరగునపుడు ॥న॥ నీళ్లసుడికి పేరయి |
| ౪౧౭ | నపుడు ॥పు॥ |
| ంశమాత్రే శిల్పాదౌ | కలా - ఇది అంశమాత్రమునకును, చిత్తరువు మొదలైన |
| కాలభేదయోః, ఇం | పనులయందలి నేర్పునకును, కూడుటకును, ౫౦౦ రెప్పపాట్లు |
| షోడశే భాగే స్యా | గల కాలమునకును, చంద్రునిలో పదియాఱవభాగమునకును, |
| రవర్ధనే. ౪౧౮ | వడ్డికిని పేరయినపుడు ॥స్త్రీ॥ |
| మవ్యక్తమధురధ్వనౌ | కలమ్ - ఇది అవ్యక్తమధురధ్వనికి పేరగునపుడు విశేష్య |
| ్వాచ్యలిఙ్గకః, | లింగము. |
| స్సంయత కేశేషు | మౌళిః - ॥స్త్రీ॥ ఇది ముడిచిన వెండ్రుకలకును, సిగకును, |
| యాం ముకుటే ద్వ | కిరీటమునకును పేరు. |
| ౪౧౯ | |
| పురీషే కిట్టే చ మ | మలమ్ - ॥న్న॥ ఇది పాపమునకును, అమేధ్యమునకును, |
| , | దేహమునందలి వసా శుక్లాది ద్వాదశవిధములయిన మలముల |
| | కును, పక్షాంతరమున చిట్టెపుఱాతికిని పేరు. |
| స్త్రేషు, జడపీవరయోః | స్థూలః - ॥త్రి॥ ఇది జడునికిని, బలసినవానికిని పేరు. |
| శ్చలసతృష్ణయోః. | లోలః - ॥పు॥ ఇది చంచలునకును, ఆశగలవానికిని పేరు. |
| శాబకయోర్బాలః | బాలః - ॥పు॥ ఇది ఎఱుకలేనివానికిని, శిశువునకును పేరు. |
| ఞ్చలయోశ్చలః, | చలః - ॥పు॥ ఇది కొండెగానికిని, కదలువానికిని పేరు. |
| ౹తి లాంతాః. | లాంతపదవర్గము ముగిసెను. |
| స్సత్తా రుద్రగర్భ | భవః - ॥పు॥ ఇది సత్తకును, శివునకును, గర్భప్రాప్తికిని, |
| ంసార జన్మసు. | సంసారమునకును, పుట్టుటకును పేరు. |
| ప్రద్రావగమనరస | ద్రవః-॥పు॥ ఇది పాఱిపోవుటకును, నడుచుటకును, ఉదకము |
| నర్మసు, | నకును, ద్రవపదమునకును, స్త్రీపురుషుల పరిహాసమునకును పేరు. |
| ్యనలౌ దావ దవౌ | దవః-దావః - ॥పు॥ ఈరెండును వనమునకును, కార్చిచ్చున |
| రే హయే. ౪౨౨ | కును, అగ్నికిని, గుఱ్ఱమునకును పేరు. |
| ర్వజ్రేఽస్త్రధారా | పవిః - ॥పు॥ ఇది వజ్రాయుధమునకును, ఆయుధముల |
| | వాదరకును పేరు. |
| శౌ పర్వతోపలౌ, | గ్రావా ॥న్-పు॥ ఇది పర్వతమునకును, ఱాతికిని పేరు. |

| | |
|---|---|
| హవా ఆజ్ఞాహ్వాన యజ్ఞా | హవః-॥పు॥ ఇది ఆజ్ఞకును, పిలుచుటకును, యజ్ఞమునకును పేరు. |
| ధవాః పతి నర ద్రుమాః. | ధవః -॥పు॥ ఇది పెనిమిటికిని, మనుష్యునకును, చండ్ర చెట్టునకును పేరు. |
| క్రమ నిమ్న మహీభాగే చండాలే జలవాయసే, ఉడుపే వానరే భేకే ప్లుతే కారండవే ప్లవః. ౪౭౪ | ప్లవః-॥పు॥ ఇది క్రమముగ లోతైనభూమికిని, చండాలునికిని, నీరుకాకికిని, తెప్పకును, కోతికిని, కప్పకును, ఎగురుటకును, నీరుకోడికిని పేరు. |
| భావః పదార్థే సత్తాయాం క్రియా చేష్టాత్మ యోనిషు, విద్వల్లీలా స్వభావేషు భూత్యభిప్రాయజన్తుషు. ౪౭౫ | భావః -॥పు॥ ఇది పదార్థమునకును, ద్రవ్యాదులయొక్క కలుగుటకును, ధాతువాచ్యక్రియకును, వ్యాపారమునకును, ఆత్మకును, యోనికిని, విద్వాంసునకును, విలాసమునకును, జంతువునకును పేరు. |
| కణ్ఠ తచ్ఛిరసో ర్గ్రీవా | గ్రీవా-॥స్త్రీ॥ ఇది కంఠమునకును, ఆకంఠముపైనున్న శిరస్సునకును పేరు. |
| ఛవి స్స్యా త్కాన్తి శోభయోః, | ఛవిః -॥స్త్రీ॥ ఇది కాంతికిని, నిగ్గునకును పేరు. |
| లక్ష్మీ స్స్యందనభేదేఽపి | లక్ష్మీ-॥స్త్రీ॥ ఇది రథవిశేషమునకును, అపిశబ్దమువలన చులకనైనదానికిని పేరు. |
| దర్వీ పణ ఖజాకయోః. | దర్వీ-॥స్త్రీ॥ పడిగెకును. తెడ్డునకును పేరు. |
| పృథ్వీ తు పృథివీకృష్ణజీరకం హింగుపత్రికా, | పృథ్వీ-॥స్త్రీ॥ ఇది భూమికిని నల్లజీలకఱ్ఱకును, ఇంగువమ్రానికిని పేరు. |
| సంవి త్ప్రతిజ్ఞాధి యుద్ధ సంకేతాచార నామసు. | సంవిత్-॥ద్-స్త్రీ॥ ఇది ప్రతిజ్ఞకును, మనోవ్యాధికిని, యుద్ధమునకును, సంకేతమునకును, ఆచారమునకును నామధేయమునకును పేరు. |
| నీవీ వార్ధుషి మూలే స్త్రీ గ్రన్థౌ జఘనవాససః, | నీవీ -॥స్త్రీ॥ ఇది మొదటిసొమ్మునకును, స్త్రీల పోకముడికిని పేరు. |
| దార్వీ దారుహరిద్రాయాం దేవదారు హరిద్రయోః | దార్వీ -॥స్త్రీ॥ ఇది మ్రానిపసుపునకును, దేవదారుచెట్టునకును, పసుపునకును పేరు. |
| జిహ్వా వా గ్రసనా జ్వాలా | జిహ్వా-॥స్త్రీ॥ ఇది వాక్కునకును, నాలుకకును, అగ్నిజ్వాలకును పేరు. |
| రేవా నీల్యాం సరిత్యపి, | రేవా-॥స్త్రీ॥ ఇది నీలిచెట్టునకును, నర్మదానదికిని పేరు. |
| తతం విలమ్బమానే స్యాం | తతమ్-॥న॥ ఇది వ్రేలాడుటకును, [illegible] |

త్స్వరూపే పరమాత్మని. | మాత్మకును పేరు.

ద్వన్ద్వం ద్వయ హిమోష్ణాది కలహోమిథునం రహః, | ద్వంద్వమ్ - ॥న॥ ఇది జంటకును, శీతోష్ణాదులకును, యుద్ధమునకును, స్త్రీపురుషుల జంటకును, ఏకాంతమునకును పేరు.

సాన్త్వం సామని దాక్షిణ్యే | సాంత్వమ్ - ॥న॥ ఇది సామోపాయమునకును, దాక్షిణ్యమునకును పేరు.

హవి ర్హవ్యే ఘృతే జలే. | హవిః - ॥స్-న॥ ఇది హోమయోగ్యమైన ద్రవ్యమునకును, నేతికిని, ఉదకమునకును పేరు.

పర్వ గ్రన్థౌ పఞ్చదశ్యాము త్సవే విషువాదికే, ప్రస్తావే చా | పర్వ - ॥స్-న॥ ఇది గణుపునకును, పూర్ణిమామావాస్యలకును, ఉత్సవమునకును, విషువత్తుమొదలైన పుణ్యకాలమునకును, ప్రస్తావమునకును పేరు.

థ కిణ్వం స్యా త్కిణ్వ్యా కో నగ్నహూ రఘుమ్. | కిణ్వమ్ - ॥న॥ ఇది గానుగపిండికిని, మద్యము సేయు మూలద్రవ్యమునకును, పాపమునకును పేరు.

ధ్రువ శ్శఙ్కౌ వటే కీలే యోగే తారాన్తరే పుమాన్, తర్కనిశ్చితయోః క్లీబే నిత్యనిశ్చలయో స్త్రిషు. గీతీ మూర్వా సాలపర్ణీ స్రుగ్భేదేషు స్త్రియాం ధ్రువా. | ధ్రువః-ఇది సామర్థ్యమునకును, మఱ్ఱిచెట్టునకును, మేకునకును, యోగవిశేషమునకును, ధ్రువనక్షత్రమునకును పేరైనపుడు ॥పు॥ తర్కపనుపూరించుటకును, ఎక్కువపదమును దెచ్చికొనుటకును, నిశ్చయింపఁబడినదానికిని పేరైనపుడు ॥న॥ నిత్యమైనదానికిని, కదలనిదానికిని, పేరగునపుడు ॥త్రి॥ ధ్రువా-ఇది గానభేదమునకును, చాగకును, ముయ్యాకుపొన్నకును, హోమసాధనమైన స్రుగ్విశేషమునకును పేరగునపుడు ॥సీ॥

జీవో బృహస్పతిప్రాణ జీవనాత్మఖగేషు నా. ౪౩౩ మహార్వ్యాం వచాయాం జీవన్త్యాం జీవాజీవవతి త్రిషు, | జీవః - ఇది బృహస్పతికిని, ప్రాణమునకును, జీవమునకును, ఆత్మకును, వెన్నెలపులుగను పక్షికిని బేరగునపుడు ॥పు॥ వింటినారికిని, వసకును, పాలతీఁగెకును బేరగునపుడు ॥సీ॥ జీవముగలదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

లవో రామసుతే లేశే విశాలే ఛేదనే చ నా. ౪౩౪ లవం మేషాదిలోమ్ని స్యా | లవః - ఇది రామునియొక్క కుమారునికిని, లేశమునకును, విశాలమునకును, ఛేదించుటకును బేరగునపుడు ॥పు॥ మేంకమొదలైనవాని రోమములకుఁ బేరగునపుడు ॥న॥

ద్దేవో రాజ్ఞి సురేఽమ్బుదే, రాజాగ్రమహిషీ మూర్వా దేవీ స్యాద్దేవ మిన్ద్రియమ్. | దేవః - ఇది రాజునకును, దేవతకును, మేఘమునకును, పేరైనపుడు ॥పు॥ రాజుయొక్క పెద్దభార్యకును, చాగకును పేరైనపుడు, దేవీ ॥సీ॥ ఇంద్రియమునకు పేరైనపుడు దేవం ॥న॥

సత్వం ద్రవ్యే పిశాచాదౌ వ్యవసాయ స్వభావయోః, | సత్వమ్-ఇది పృథివ్యాది ద్రవ్యములకును, పిశాచాదులకును, ఉద్యోగమునకును, స్వభావమునకును, సత్వగుణమునకును, ప్రాణ

గుణప్రాణబల స్వాంతసత్తా
స్వస్త్రీ తు జన్తుషు. ౪౩౯

మునకును, బలమునకును, చిత్తమునకును, ద్రవ్యాదులయొక్క కలుగుటకును పేరైనపుడు ॥న॥ జంతువులకుఁ బేరగునపుడు ॥స్త్రీ॥

విశ్వం స్యా జ్జగతి క్లీబే
విహాయ్యాం తు స్త్రియాం
మయమ్, కృత్స్నే త్రిషు
న నా శుణ్ఠ్యాం పుమాన్
దేవేషు భూమ్ని చ.

విశ్వమ్-ఇది లోకమునకు పేరైనపుడు ॥న॥ అతివసకు పేరయినపుడు ॥సీ॥ సమస్తమునకు పేరయినపుడు ॥త్రి॥ శొంఠికిఁ బేరైనపుడు ॥స్త్రీ॥ విశ్వేదేవులకు పేరయినపుడు పుంలింగ్యమును నిత్యబహువచనమును.

బంధనే దూరమార్గే చక్లీబే
ప్రాధ్వం నతే త్రిషు,

ప్రాధ్వమ్-ఇదికట్టుటకును, దూరమార్గమునకును పేరగునపుడు ॥న॥ వంచఁబడినదానికి పేరగునపుడు ॥త్రి॥

అవి ర్నా పర్వతే సూ
ర్యే మేషే మూషికకంబళే.
ప్రాకారే భవనే భాసి స్త్రీ
తు పుష్పవతీ భువోః,

అవిః-ఇది పర్వతమునకును, సూర్యునికిని, గొఱ్ఱెకును, ఎలుకగంగడోలునకును, ప్రాకారమునకును, గృహమునకును, కాంతికిని పేరయినపుడు ॥పు॥ రజస్వలయైయున్నస్త్రీకిని, భూమికిని పేరగునపుడు ॥సీ॥

కవిః పుమాన్ కావ్య
కర్తృశుక్ర వాల్మీకిసూరిషు,
ఖలీనే తు కవి స్త్రీ(సి) స్యా

కవిః-ఇది కావ్యకర్తకును, శుక్రునికిని, వాల్మీకికిని, విద్వాంసునకును బేరగునపుడు ॥పు॥ కళ్లెమునకు పేరగునపుడు ॥సీ॥

త్కణ్వం పాపే మునౌ
తు నా,

కణ్వమ్-ఇది పాపమునకుఁ బేరగునపుడు ॥న॥ కణ్వమునికిఁ బేరగునపుడు ॥పు॥

త్వగ్భేదేనా స్రువ స్త్రీ(సి)
తు మూర్వాయా

స్రువః-ఇది చర్మవిశేషమునకుఁ బేరగునపుడు ॥పు॥ చాగచెట్టునకును పేరగునపుడు ॥సీ॥

మధ పూర్వ జే. ౪౪౦. పూ
ర్వాదిగ్దేశకాలస్థ ద్రవ్యే పూ
ర్వ స్త్రీ(సి)లింగకః,

పూర్వః-॥త్రి॥ ఇది ముందుపుట్టినవానికిని, తూర్పుదిక్కునగాని, పూర్వకాలమునగాని, పూర్వదేశమునగాని యున్నద్రవ్యమునకును పేరు.

ఊర్ధ్వం స్యా దుపరి క్లీబే
త్రిషు తూత్థిత తుఙ్గయోః.
౪౪౧. ఉపరిస్థే చా

ఊర్ధ్వమ్-ఇది ఊర్ధ్వప్రదేశమునకు పేరగునపుడు ॥న॥ లేచినదానికిని, ఉన్నతమైనదానికిని, పైనున్నదానికిని పేరైనపుడు ॥త్రి॥

థ పార్శ్వ మస్త్రీ కక్షా
న్తరేఽన్తికే,

పార్శ్వమ్-॥స్త్రీ॥ ఇది ఇరుచంకల క్రిందికిని, సమీపమునకును పేరు.

భాస్వా నర్కే త్రిషూ
ద్దీప్తే

భాస్వాన్-॥త్-పు॥ ఇది సూర్యునికిని పేరు. ప్రకాశించుదానికి పేరగునపుడు ॥త్రి॥

నాఽర్వాఽశ్వే కుత్సితే

అర్వా-॥న్-పు॥ ఇదిగుఱ్ఱమునకు పేరు. కుత్సితునకు పేరై

త్రిషు. ౪౪౨

నపుడు ॥త్రి॥

క్లీబే శివం భద్రసుఖోద
కేషు ద్రవ్యే త్రిషు స్యా
ద్గిరిశేతు పుంసి, శివా భవే
దామలకీ భవానీ హరీత
కీసక్తుఫలాస్సృగాలీ. ౪౪౩.

శివమ్-ఇది శుభమునకును, సుఖమునకును, ఉదకమునకును పేరగునపుడు ॥న॥ ద్రవ్యమునకు పేరగునపుడు ॥త్రి॥ శివునికిం బేరగునపుడు ॥పు॥ ఉసిరికచెట్టునకును, గౌరికిని, కంకచెట్టునకును, జమ్మిచెట్టునకును, నక్కకును బేరగునపుడు ॥స్త్రీ॥

ధన్వ చాపే మరౌ నాఽథ

ధన్వ-॥న్-న॥ ఇది ధనుస్సునకుం బేరు. ॥న॥ మెట్టభూమికిం బేరగునపుడు ॥పు॥

త్రిషు హ్రస్వోఽల్పఖర్వ
యోః,

హ్రస్వః-॥త్రి॥ ఇది అల్పమైనదానికిని, మఱుగుజ్జువానికిని పేరు.

పక్వం భవే త్పరిణతే వి
నాశాభిముఖేఽపిచ. ౪౪౪
ఇతి వాంతాః.

పక్వమ్-॥న॥ ఇది పండినదానికిని, నాశోన్ముఖమైనదానికిని పేరు.

వాంతపదవర్గము ముగిసెను.

---

పాశో రజ్జౌ సనిందార్థ
శ్ఛత్రాదిభ్యః పరో యది,
కర్ణా త్పర స్సువర్ణార్థః క
లాపార్థః కచా త్పరః.
౪౪౫

పాశః-॥పు॥ ఇది త్రాటికిని, ఛత్త్రాదిశబ్దములకు పైనుండెనేని నిందకును, కర్ణశబ్దమునకు మీఁదనుండునేని బంగారపుసొమ్మునకును, కచకేశశబ్దములమీఁదనుండెనేని కొప్పునకును పేరు. ఉదాహరణములు.—"ఛత్త్రపాశః, రాజాధముఁడు, కర్ణపాశః, కర్ణభూషణము, కేశపాశః, కొప్పు" ఇత్యాదు లూహ్యంబులు.

తిరోధానే క్షయే నాశో

నాశః-॥పు॥ ఇది మఱుఁగౌటకును, చచ్చుటకును పేరు.

రాశి ర్మేషాది పుఞ్జయోః,

రాశిః-॥పు॥ ఇది మేషాదిరాసులకును, కూటమికిని పేరు.

ఇష్ట్యన్తర మమావాస్యా
దర్శ

దర్శః-॥పు॥ ఇది ఇష్టిభేదమునకును, అమావాస్యకును పేరు.

శ్చారాహవౌ స్పశౌ.

స్పశః-॥పు॥ ఇది వేగులవానికిని, యుద్ధమునకును పేరు.

దంశో దోషే వర్మ మర్మ
ఖణ్డనం వనమక్షికా,

దంశః-॥పు॥ ఇది దోషమునకును, కవచమునకును, మర్మమునకును, ఖండించుటకును, అడవియీఁగకును పేరు.

వంశో వేణౌ సమూహే
చ పృష్ఠాస్థిని కులేఽపి చ.

వంశః-॥పు॥ ఇది వెదురునకును, సమూహమునకును, వెన్నెముకకును, వంశమునకును పేరు.

అంశు స్తంత్వాదిసూక్ష్మాం
శే కిరణే తరణావపి,

అంశుః-॥పు॥ ఇది దారము మొదలైనవానియొక్క సూక్ష్మాంశమునకును, కిరణమునకును, సూర్యునికిని పేరు.

వేశో వేశ్యాగృహే గేహ
మాత్రనైపథ్యయో రపి.

వేశః-॥పు॥ ఇది వేశ్యాగృహమునకును, సామాన్యగృహమునకును, వేషమునకును పేరు.

| | |
|---|---|
| వాశా భవే దటరుషే | వాశా-॥సీ॥ అడ్డసరపుచెట్టునకు పేరు. |
| వాశీ తక్షకసాధనే, | వాశీ-॥సీ॥ ఇది బాడిసెకు పేరు. |
| పేశీ త్వణ్డే ఖగాదీనాం మాంస్యాం ఖడ్గపిధానకే. | పేశీ-॥సీ॥ ఇది పక్ష్యాదుల గ్రుడ్లులకును, జటామాంసికిని కత్తియొఱకును పేరు. |
| ఆశీ రురగదంష్ట్రాయాంశుభ వాగభిలాషయోః, | ఆశీః-॥ష్-సీ॥ ఇది పాముయొక్క కోఱకును, శుభవాక్కునకును, అభిలాషకును పేరు. |
| వర్త్యవస్థాంశుకాంశేషు దశా | దశా-॥సీ॥ ఇది వత్తికిని, బాల్యాదిదశలకును, వస్త్రముం తుదనున్న బద్దెకును పేరు. |
| ఽఽశాతు దిగీహాయోః. | ఆశా-॥సీ॥ ఇది దిక్కునకును, ఇచ్ఛకును పేరు. |
| నిశా రాత్రౌ హరిద్రాయా | నిశా-॥సీ॥ ఇది రాత్రికిని, పసపునకును పేరు. |
| మర్శో దుర్నామ రోగయోః, | అర్శః-॥న్-పు॥ ఇది ఏనుఁగుజెలగకును, మూలవ్యాధికిని పేరు. |
| త్రి ష్వధీనే వశో వా ఇచ్ఛా ప్రభుత్వాధీనతాసు నా. ౪౫౦. వశా వన్ధ్యగవీ యోషా దుహితా కరిణీ చ సా, | వశః-ఇది పరాధీనునికిఁ బేరగునపుడు ॥సీ॥ కోరికెకలుగుటకును, ప్రభుత్వమునకును, ఆధీనత్వమునకును బేరగునపుడు ॥పు॥ గొడ్డుటావునకును, గొడ్రాలికిని, కొమార్తెకును, స్త్రీగజమునకును బేరగునపుడు ॥సీ॥ |
| దర్భేఽపి కుశ మస్త్రీ స్యా ద్ద్వీపే రామసుతేఽపి నా. ౪౫౧. అయోవికారేతు కుశీ కుశా స్యా వాత్కుశం జలమ్, | కుశమ్-ఇది దర్భకుఁ బేరగునపుడు ॥పు॥ కుశద్వీపమునకును రామునికొమారునికిఁ బేరగునపుడు ॥పు॥ ఇనుముచేతఁ జేయబడిన వస్తువులకుఁ బేరగునపుడు, కుశీ-కుశా ॥సీ॥ నీళ్లకుఁ బేరగునపుడు, కుశం ॥న॥ |
| కాశ స్తృణవిశేషేనా | కాశః-॥పు॥ ఇది రెల్లునకుఁ బేరు. |
| కాశీ వారాణసీ మతా. | కాశీ-॥సీ॥ ఇది కాశికిఁ బేరు. |
| కోశోఽస్త్రీ కుడ్మలేఽ ఖాఘే గుహ్యాంగే శాస్త్ర దివ్యయోః, గృహే దేహే పుస్తకౌఘే పేశ్యా మసిపిధానకే. ౪౫౪ | కోశః-॥పు॥ ఇది మొగ్గకును, బొక్కసమునకును, యోనికిని, శాస్త్రమునకును, దివ్యప్రమాణంబునకును, గృహమునకును దేహమునకును, పుస్తకసమూహమునకును, గుడ్డునకును, కత్తియొఱకును పేరు. |
| ఈశ శ్శమ్భౌ ప్రభౌ తు త్రిష్వీశా లాఙ్గలదణ్డకే, | ఈశః - ఇది శివునకుఁ బేరగునపుడు ॥పు॥ ప్రభువునకు బేరగునపుడు ॥త్రి॥ ఏఁడికోలకుఁ బేరగునపుడు ॥సీ॥ |

రుజా స్పర్శన దానేషు స్పర్శో నా స్ప్రష్టరి త్రిషు. ౪౫౪

స్పర్శః-ఇది రోగమునకును, తాఁకుటకును, దానమునకును పేరగునపుడు ॥పు॥ తాఁకెడువానికిఁ బేరగునపుడు ॥త్రి॥

ఇతి శాన్తాః.

శాంతపదవర్గము ముగిసెను.

---

ప్రేషణే మర్దనే ప్రైషః

ప్రైషః-॥పు॥ ఇది అంపుటకును, నూఱుటకును పేరు.

కర్షః కర్షణమానయోః,

కర్షః-॥పు॥ ఇది ఒరియుంటకును, కాలుపలమెత్తునకును పేరు.

వృషాణ ఇన్ద్రోక్షనరా

వృషా-॥న్-పు॥ ఇది ఇంద్రునికిని, ఎద్దునకును, మనుష్యునకును పేరు.

స్తర్షో లిప్సాపిపాసయోః.

తర్షః-॥పు॥ ఇది కోరికెకును, దప్పికిని పేరు.

ఋషి ర్దేవే వసిష్ఠాదౌ జ్ఞానవృద్ధే దిగమ్బరే,

ఋషిః-॥పు॥ ఇది దేవతకును, వసిష్ఠాదులకును, జ్ఞానాధికునికిని, దిసమొలవానికిని పేరు.

మాష స్త్వగ్దోషధాన్యేషు మాష

మాషః-॥పు॥ ఇది అయిదుగురిగింజల యెత్తునకును, చర్మదోషమునకును, మినుములకును పేరు.

శ్శోషస్తు, శోషణే. ౪౫౫. యక్ష్మణ్యపి

శోషః-॥పు॥ ఇది ఎండుటకును, క్షయరోగమునకును, అపిశబ్దమువలన వాఁపునకును పేరు.

తుషస్తు స్యా ద్ధాన్యత్వచి విభీతకే,

తుషః-॥పు॥ ఇది వడ్లపొట్టునకును, తాండ్రచెట్టునకును పేరు.

పౌషో మాసే మహాయుద్ధే

పౌషః-॥పు॥ ఇది మాసభేదమునకును, గొప్పయుద్ధమునకును పేరు.

తృట్ స్త్రీ లిప్సా పిపాసయోః. ౪౫౬

తృట్-॥ష్-స్త్రీ॥ ఇది కోరికెకును, దాహమునకును పేరు.

దృష త్పాషాణమాత్రే చ నిష్పేషణశిలా చ సా,

దృషత్ ॥ద్-స్త్రీ॥ ఇది పాషాణసామాన్యమునకును, నూఱుడు రాతికిని పేరు.

మిషన్తు స్పర్ధనే వ్యాజే

మిషమ్-॥న॥ ఇది కలహమాడుటకును, ఒకకార్యము నుద్దేశించి కపటమున మఱియొక కార్యము చేయుంటకును పేరు.

వర్షోఽస్త్రీ భారతాదికే. వృష్టావబ్దే ప్రావృషితు వర్షాస్స్యుర్భూమ్ని స్త్రియాం,

వర్షః-ఇది భారతాదివర్షములకును, వానకును, సంవత్సరమునకును పేరగునపుడు ॥పు॥ వర్షర్తువునకుఁ బేరగునపుడు నిత్యబహువచన స్త్రీలింగము-వర్షాః.

వృషో ధర్మోక్షపుంభేదరేతశ్శక్రాఽఽఖువాజిషు. రాశౌ శృఙ్గ్యాం బలే నా

వృషః-ఇది ధర్మమునకును, ఎద్దునకును, పురుషభేదమునకును, రేతస్సునకును, ఇంద్రునకును, ఎలుకకును, గుఱ్ఱమునకును, వృషభరాశికిని, వృషభమను ఔషధమునకును, బలమునకును పేరగు

స్యా ద్రేతస్వి శ్రేష్ఠయో స్త్రిషు, వృషా స్త్రియా మారుష సైన్యప మూషిక వర్ణ్యపి. ౪౬౧ | నపుడు ॥త్రి॥ వీర్యవృద్ధిగలవానికిని, శ్రేష్ఠునకును వేరగునపుడు ॥త్రి॥ అడ్డసరపుచెట్టునకును, ఎలుకచెవిలీఁగెకును వేరగునపుడు ॥సీ॥

విషా త్వతివిషాయాం స్త్రీ విషం తు గరళే జలే, | విషా - ఇది అతివసకుఁ వేరగునపుడు ॥సీ॥ గరళమునకును, ఉదకమునకును వేరగునపుడు-విషమ్ ॥న॥

ఉషా బాణసుతా రాత్రి ర్నోషః కల్య సన్ధయోః. ౪౬౨ | ఉషా-ఇది బాణాసురుని కూఁతునకును, రాత్రికిని వేరై నపుడు ॥సీ॥ ప్రాతఃకాలమునకును, ప్రతిజ్ఞకును వేరగునపుడు ॥పు॥ ఉషః.

సాయం నిశ్యవ్యయం దోషా స్త్రీ వా నా దూషణాఘయోః, | దోషా-ఇది సాయంకాలమునకును, రాత్రికిని వేరగునపుడు అవ్యయమును, స్త్రీలింగమునుం గలదు. దూషణకును, పాపమునకును వేరగునపుడు ॥పు॥

ఘోషో ధ్వని ర్మేఘనాద స్వనివాభీరపల్ల్యపి. ౪౬౩ కాంస్యంచ ఘోషణా నాథ ఘోషా స్త్రీ శతపుష్పికా, | ఘోషః - ఇది ధ్వని సామాన్యమునకును, మేఘధ్వనికిని, గొల్లపల్లెకును, కంచునకును, చాటునకును వేరగునపుడు ॥పు॥ ఆడవిసదాపచెట్టునకును వేరగునపుడు ॥సీ॥

ఝషా నాగబలాయాం స్త్రీ నా మత్స్యమకరే వనే. ౪౬౪ | ఝషా - ఇది చీరచెట్టునకుఁ వేరైనపుడు ॥సీ॥ మత్స్యమునకును, మొసలికిని, వనమునకును వేరైనపుడు ॥పు॥

శేషోఽనన్త హరి శ్లేషం త్రి ష్వన్య దుపయుక్తతః, | శేషః - ఇది ఆదిశేషునికిని, విష్ణువునకును వేరయినపుడు ॥పు॥ మిగిలినదానికిఁ వేరగునపుడు ॥త్రి॥

కర్షూ ర్వార్తా కరీషాగ్ని ర్షూ కుల్యాభిదాయినీ. | కర్షూః-ఇది కృషికిని, పిడకనిప్పునకును వేరగునపుడు ॥పు॥ నదికిఁ వేరగునపుడు ॥సీ॥

ఇతి షాన్తాః. | షాంతపదవర్గము ముగిసెను.

---

హంస స్మన్మరే ఖగే విష్ణా యతౌ నిర్లేపభూభుజి, వేఽర్కేఽశ్వే శ్వేతవృషే స్యా న్మన్త్ర పరమాత్మనోః. ౪౬౬ | హంసః-॥పు॥ ఇది మన్మథునికిని, హంసకును, విష్ణువునకును, యతికిని, గర్వములేని భూపతికిని, జీవునికిని, సూర్యునికిని, గుఱ్ఱమునకును, తెల్లని యెద్దునకును, మంత్రవిశేషమునకును, పరమాత్మకును పేరు.

గోపక్రీడా రతే రాసో | రాసః - ॥పు॥ ఇది గోపులతోడియాటకును, రతికిని పేరు.

| | |
|---|---|
| వ్యాసో విస్తార తాపసౌ. | వ్యాసః-॥పు॥ఇది విస్తారమునకును, వ్యాసుఁడను మునికిని పేరు. |
| కంసో దైత్యే పానపాత్రే కాంస్యే మానాన్తరే పిచ. ४६२ | కంసః-॥పు॥ ఇది కంసుఁడను దైత్యునకును, పానముచేయు పాత్రమునకును,కంచునకును, కొలతయొక్క భేదమునకును పేరు. |
| భా స్త్రీ(స్) భాసి ఖగే గోష్ఠే | భాః - ॥స్-సీ॥ ఇది కాంతికిని, పక్షికిని, పశువులదొడ్డికిని పేరు. |
| త్రాసోభీ మణిదోషయోః, | త్రాసః-॥పు॥ఇది భయమునకును, మణులదోషమునకును పేరు. |
| హింసా చౌర్యాది వధయో | హింసా - ॥సీ॥ ఇది చౌర్యము మొదలైన యకార్యములకును, వధకును పేరు. |
| రశ్వాదయాం మాతరి ప్రసూః. | ప్రసూః-॥సీ॥ ఇది గుఱ్ఱమునకును, తల్లికిని పేరు. |
| వత్సరే కుటజే వత్స స్సుతాద్యా తర్ణకే త్రిషు, వక్షస్యస్త్రీ చా | వత్సః - ఇది సంవత్సరమునకును, కొడిసెచెట్టునకును, కుమారుఁడు మొదలైనబాలురకును పేరైనపుడు ॥పు॥ దూడకు పేరగునపుడు ॥త్రి॥ వక్షస్స్థలమునకుఁ బేరగునపుడు ॥స్న॥ |
| థ మాంసం క్రవ్యే | మాంసమ్ - ॥న॥ ఇది మాంసమునకుఁ బేరు. |
| మాంసీ జటా స్మృతా, | మాంసీ - ॥సీ॥ ఇది జటామాంసికిఁ బేరు. |
| వాసో నివాసోటరుషా వాసో వస్త్రే నపుంసకమ్, | వాసః - ఇది ఉనికిపట్టునకును, అడ్డసరపుచెట్టునకును పేరగునపుడు ॥పు॥ వస్త్రమునకు పేరగునపుడు-వాసః ॥స్-న॥ |
| దాసీ చేటీ చ ఝుంటీ చ | దాసీ-॥సీ॥ ఇది బానిసకును, నల్లపువ్వుల గోరింటకును పేరు. |
| దాస స్స్యా ద్భృత్య శూద్రయోః. ४६० | దాసః - ॥పు॥ ఇదికూలికిని, శూద్రునకును పేరు. |
| వసు ర్నా దేవ భేదేషు యోక్త్రాగ్ని ధనదాంశుషు, మధురే తు త్రిషు క్లీబే సలిలే ధన రత్నయోః. ४६१ | వసుః-ఇది అష్టవసువులకును, పశువుల మెడకుగట్టు మోకునకును, అగ్నికిని, కుబేరునికిని, కిరణమునకును పేరగునపుడు ॥పు॥ మధురమైనదానికిఁ బేరగునపుడు ॥త్రి॥ ఉదకమునకును, ధనమునకును, రత్నమునకును పేరగునపుడు ॥న॥ |
| శృఙ్గారముఖ్య మధురాది సువర్ణ రేతో నిర్యాస రాగ గరళ ద్రవపారదేషు, ఆస్వాదన ధ్వని సుధాంబు రసాఖ్యధాతు ష్వి ష్టో రసో-థ రసనా ధరణీ రసా స్యాత్. ४६౨ | రసః-ఇది శృంగారము మొదలైనరసములకును, తీపు మొదలైన షడ్రసములకును, బంగారమునకును, రేతస్సునకును, బంకకును, ప్రేమకును, కాలకూటమునకును, ద్రవమునకును, పాదరసమునకును, రుచికిని, ధ్వనికిని, అమృతమునకును, గంధకాది ధాతువునకును పేరగునపుడు ॥పు॥ నాలుకకును, భూమికిని పేరైనపుడు ॥సీ॥ |
| కాసూ ర్బుద్ధౌ కువాచి | కాసూః-॥సీ॥ ఇది బుద్ధికిని, కుత్సితవాక్కునకును పేరు. |

స్త్రీ శంసా స్తుత్యభిలాభయోః.

ఇతి సాన్తాః.

---

గవాం స్కన్ధే గవాశ్వాసే వాహనే పవనే వహః.
అర్కాద్యాదానోపరాగపూతనాద్యా గ్రహా స్మృతాః,
అవిద్యామూర్ఛయోర్మోహ స్స్యా దహి ర్వృత్ర సర్పయోః. ౪౭౪
పోహః ప్రకృష్టతర్కే చ కుఞ్జరాం ఘ్రేశ్చ పర్వణి,
అబ్విశేషగుణే స్నేహ స్తైల సౌహార్దయో రపి. ౪౭౫
వ్యూహ స్స్యా ద్బలవిన్యాసే బృందేఽపి
ఈహోద్యమేచ్ఛయోః,
కుహూః స్త్రీ కోకిలాలాపే వినష్టేన్దు తిథావపి. ౪౭౬
లోహశ్శస్త్రేచ కాంస్యాది సర్వతైజస వస్తుని,
రహో రహస్యే సురతే
బర్హం పర్ణ శిఖణ్డయోః.
హేమన్త మాసౌ సహసౌ నరౌ క్లీబం సహోబలే,
సహా కుమారీ భూమ్యో స్త్రీ(స్త్రీ) సాకమర్థే సహావ్యయమ్. ౪౭౭

శంసా ॥స్త్రీ॥ ఇది స్తుతికిని, కోరికెకును పేరు.

సాంతపదవర్గము ముగిసెను.

---

వహః-॥పు॥ ఇది యెద్దులమూఁపునకును, వానియూపిరికిని, వాహనమునకును, గాలికిని పేరు.

గ్రహః-॥పు॥ ఇది సూర్యాదినవగ్రహములకును, గ్రహించుటకును, సూర్యచంద్రగ్రహణములకును, పూతనాదిభూతవిశేషములకును పేరు.

మోహః-॥పు॥ ఇది అజ్ఞానమునకును, ఒడలెఱుంగమికిని పేరు.

అహిః-ఇది వృత్రాసురునికిని, సర్పమునకు పేరు.

పోహః - ॥పు॥ ఇది తర్కవాక్యమునకును, ఎక్కువపదము నధ్యాహారము చేయుటకును, ఏనుగుపాదమునందలి గణుపులకును పేరు.

స్నేహః - ॥పు॥ ఇది ఉదకాదులయందుండు చూర్ణాదుల ముద్దగాఁజేయు గుణవిశేషమునకును, నూనెకును, ప్రేమకును పేరు.

వ్యూహః - ॥పు॥ ఇది చతురంగబలమును యథాస్థానముగఁ దీర్చియుంచుటకును, కూటమికిని, అపిశబ్దమువలన పద్మశకటాది వ్యూహములకును పేరు.

ఈహా - ॥స్త్రీ॥ ఇది యత్నమునకును, ఇచ్ఛకును పేరు.

కుహూః - ॥స్త్రీ॥ ఇది కోకిలధ్వనికిని, చంద్రకళలేని యమావాస్యకును పేరు.

లోహః-॥పు.న॥ ఇది శస్త్రమునకును, కంచుమొదలైన సకల లోహముల చేతఁ జేయఁబడిన వస్తువులకును నామము.

రహః-॥స్-న॥ ఇది రహస్యమునకును, సురతమునకును పేరు.

బర్హమ్ - ॥న॥ ఇది ఆకునకును, నెమలిపింఛమునకును పేరు.

సహః - ॥స్-న॥ ఇది హేమంతఋతువునకును, మార్గశీర్షమాసమునకును పేరు. బలమునకును వేరగునప్పుడు - సహః ॥స్-న॥ పిన్నగోరింటకును, భూమికిని వేరగునప్పుడు-సహా ॥స్త్రీ॥ తోడ అను నర్థమున 'సహ' అని యవ్యయము.

సింహపుచ్ఛే కన్దరయో ర్గు
హా స్త్రీ షణ్ముఖే తు నా,
శాన్త్యుత్సవౌ తు మహాః సీ
పుమాం శ్చైవ మహ ఉత్స
వే. ౪౭౯

గుహః - ఇది నక్కతోఁకకసువునకును, గుహకును పేర నపుడు ॥స్త్రీ॥ కుమారస్వామికిఁ బేరగునపుడు ॥పు॥

మహః - ॥న్-న॥ ఇది కాంతికిని, ఉత్సవమునకును పేర ఉత్సవమునకు పేరగునపుడు పులింగమాయెనేని అకారాంతము.

గృహం గృహాశ్చ పుం
భూమ్ని ద్వా విమౌ గేహ
భార్యయోః,

గృహమ్ - ॥న॥ గృహాః ॥పు॥ ఇది నిత్యబహువచనము. ఈ రెండును గృహమునకును, భార్యకును నామము.

సింహో మృగేన్ద్రే రా
శౌ చ శ్రేష్ఠే రాజాదికా
త్పరః. ౪౮౦

సింహః-॥పు॥ ఇది సింహమునకును, సింహరాశికిని నామము ఇది రాజాదిశబ్దములకు మీఁదనుండెనేని శ్రేష్ఠవాచకము ఉదాహరణము—"రాజసింహః=రాజశ్రేష్ఠుఁడు, పురుషసింహః=పురుషశ్రేష్ఠుఁడు" ఇత్యాదులు.

సింహీ సింహస్త్రియాం
వాటరుషే రాహోశ్చ మా
తరి,

సింహీ - ఇది ఆఁడుసింహమునకును, అడ్డసరపుచెట్టునకును రాహువుయొక్క తల్లికిని నామము.

బాహు ర్భుజే స్త్రీ

బాహుః - ॥స్త్రీ॥ ఇది భుజమునకునామము.

వాహో నా యాననేఽశ్వే
వృషభే ఽపిచ. ౪౮౧

వాహః-॥పు॥ ఇది పల్లకిమొదలైన వాహనములకును, గుఱ్ఱమునకును, ఎద్దునకును నామము.

బర్హి ర్నాఽగ్నౌ కుశే
జే త్రిష్వర్చ్యే ఽర్హజనే
నా,

బర్హిః - ॥న్-పు॥ ఇది అగ్నికిఁ బేరు. దర్భకుఁ బేరైనపుడు ॥న॥ పూజ్యునకుఁ బేరగునపుడు ॥త్రి॥ యోగ్యజనమునకు బేరగునపుడు ॥పు॥

బహు స్స్యా ద్విపులే
త్ర్యాది సంఖ్యాయాం చ
త్రిలిఙ్గకః. ౪౮౨

బహుః - ॥త్రి॥ ఇది విస్తారమునకును, మూఁడు మొదలైన సంఖ్యలకును బేరు.

ఇతి హాన్తాః.

హాంతపదవర్గము ముగిసెను.

పక్ష స్సహాయ గరుద న్తి
సాధ్యభిత్తి మిత్రేషు చుల్లి
వరే నృపకుఞ్జరే చ, బృన్దే
చా దుపరి మాసదళే చ
క్షద్వారే బలే చ గజపా
ర్శ్వవిరోధయో శ్చ. ౪౮౩

పక్షః-॥పు॥ ఇది సహాయమునకును, ఱెక్కలకును, సమీపమునకును, హేతువుచేత సాధింపఁదగిన సందేహార్థముగలదానికిని, స్నేహితునకును, ప్రాఁకియొక్క సందునకును, రాజుయొక్క యేనుఁగునకును, కచకేశాదిశబ్దములపై నుండెనేని సమూహమునకును, అనఁగా - కేశపక్షః = కచపక్షః ఇత్యాది స్థలములయందు కొప్పునకును, మాసముయొక్క శుక్లకృష్ణపక్షములకును, దిడ్డి

ద్వీపో గర్దభాణ్డః
పిప్పలీ ద్రుమః,
ఽపవర్గే మృత్యౌ
నేముష్కకద్రుమే.
క్షో కాక పికౌ
కుబేరే గుహ్యకే

తు భిక్షితాన్నా
చ్ఛాయాం భృతిసేవ
౪౭౫

వృత్తే క్షణే ప్రేక్షా
రక్షణలాక్షయోః,
మిన్ద్రియ మక్షో నా
వ్యవహారయోః. పా
టే కర్షే ద్యూతభేదే
మే,
వృక్షం భల్లూకే
న పుమా నయమ్.
శరవ్యే వ్యాజేచ
గాం నియుంతేతునా,
స్తు పుంసి మహి
షు కార్త్స్న్యేని
గాః. ౪౭౬

గుల్మే తృణే బా
లే స్త్రీ తూత్తర

వాఁకిలికిని, బలమునకును, ఏనుగుయొక్క యిరుప్రక్కలకును విరోధమునకును పేరు. ఇచ్చట హేతువుచేత సాధింపఁదగిన సందేహార్థము గలదానికి నుదాహరణము -'పర్వతో వహ్నిమాన్ ధూమవత్త్వాత్' అనువాక్యమున పొగ హేతువు. దానింబట్టి సాధింపఁదగిన యర్థము అగ్ని. ఆయగ్ని గలది పర్వతము గనుక సాధ్యముగల పర్వతము పక్షము.

ప్లక్షః-॥పు॥ఇది ద్వీపవిశేషమునకును, కలజువ్విచెట్టునకును, జువ్విచెట్టునకును, పిప్పలికిని, వృక్షసామాన్యమునకును పేరు.

మోక్షః-॥పు॥ ఇది మోక్షమునకును, మృత్యువునకును, విడుచుటకును, మొక్కపుచెట్టునకును పేరు.

ధ్వాంక్షః-॥పు॥ ఇది కాకికిని, కోకిలకును నామము.

యక్షః - ॥పు॥ ఇది కుబేరునికిని, గుహ్యాలకును, దేవయోని విశేషములకును పేరు.

భిక్షా - ॥స్త్రీ॥ ఇది భిక్షమెత్తి తేఁబడినయన్నము మొదలైన వానికిని, యాచకునకును, కూలికిని, సేవకును నామము.

ప్రేక్షా-॥స్త్రీ॥ఇది బుద్ధికిని, వృత్తమునకును, చూచుటకును పేరు.

రక్షా-॥స్త్రీ॥ ఇది రక్షించుటకును, లత్తుకకును నామము.

అక్షమ్-ఇది యింద్రియమునకుఁ బేరగునపుడు॥న॥బండిచక్రమునకును, వ్యవహారమునకును, పాచికెకును, బండికిని, ౮౦ గురిగింజల యెత్తుగలదానికిని, జూదమునకును, తాండ్రచెట్టునకును బేరగునపుడు ॥పు॥

ఋక్షమ్ - ఇది నక్షత్రమునకుఁ బేరైనపుడు ॥న॥ ఎలుఁగుగొడ్డునకును, దుండిగపుమ్రానికిని బేరైనపుడు ॥పు॥

లక్షమ్ - ఇది గురికిని, కపటమునకును బేరగునపుడు ॥న॥ లక్షసంఖ్యకుఁ బేరగునపుడు ॥పు॥

స్యక్షః - ఇది ఎనుపోతునకును బేరగునపుడు ॥పు॥ సమస్తమగుటకును, తక్కువైనదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

కక్షః - ఇది పొదకును, తృణమునకును, చంకకును బేరగునపుడు ॥పు॥ వాదమున నుత్తర ప్రత్యుత్తరక్రమమునకుఁ బేరగునపుడు-కక్షా ॥స్త్రీ॥

దక్షః ప్రజాపతౌ వహ్నౌ తామ్రచూడే హరే మునౌ. శర్గా. త్రిష్వభిజ్ఞే

దక్షః - ఇది దక్షప్రజాపతికిని, అగ్నికిని, కోడికిని, శివునికిని, మునికిని పేరగునపుడు ॥పు॥ తెలిసినవానికిని పేరగునపుడు ॥త్రి॥

స్యాద్రూక్షవత్తు రూక్షం నిష్ప్రేమ్ణి చిక్కణే.

రూక్షమ్-ఇది దయలేనివానికిని, పరుసనిదానికిని పేరు. ఈ శబ్దము - న్యక్షవత్ = న్యక్షశబ్దమువలె, త్రిలింగములయందును వర్తించును.

ఇతి క్షాంతాః.

క్షాంతపదవర్గము ముగిసెను.

---

శ్లో. ఇతి జగదుపకారిణ్యా మిరుగపదణ్డాధినాథరచితాయామ్,
ద్వ్యక్షరపదకాణ్డోఽయం పూర్ణో నానార్థరత్నమాలాయామ్.

టీ. ఇతి=ఇది, జగదుపకారిణ్యామ్-జగత్=లోకమునకు, ఉపకారిణ్యాం = ఉపకారకమైనదియు, ఇరుగపదణ్డాధినాథరచితాయామ్-ఇరుగపదణ్డాధినాథ = ఇరుగపదండాధినాథుని చేత, రచితాయామ్ = చేయఁబడినదగు, నానార్థరత్నమాలాయామ్ = నానార్థరత్నమాల యను గ్రంథమునందు, అయమ్=ఈ, ద్వ్యక్షరపదకాణ్డః-ద్వ్యక్షర=రెండక్షరములుగల, పద= శబ్దములయొక్క, కాణ్డః = సమూహము, పూర్ణః=ముగిసెను.

ద్వ్యక్షర కాండము

సంపూర్ణము.

---

# త్ర్యక్షరకాండము.

సంపర్కో రతిసంసర్గౌ
వితర్కోవూహసంశయౌ,
మరూకౌ కేకిమణ్డూకౌ
ఆలోకౌ దర్శనద్యుతీ. ౧

సంపర్కః-పు॥ ఇది రతికిని, కూడుటకును పేరు.

వితర్కః-పు॥ ఇది ఊహకును, సంశయమునకును పేరు.

మరూకః-పు॥ ఇది నెమలికిని, కప్పకును పేరు.

ఆలోకః-పు॥ ఇది దర్శనమునకును, ప్రకాశమునకును పేరు.

ఉలూకౌ ఘూకదేవేన్ద్రౌ
జమ్బుకౌ పాశిఫేరవౌ,
దుణ్డుకౌ శోణకక్రూరౌ
వృషాఙ్కౌ శివసజ్జనౌ. ౨

ఉలూకః - పు॥ ఇది గుడ్లగూబకును, ఇంద్రునకును పేరు.

జంబుకః-పు॥ ఇది వరుణునికిని, నక్కకును పేరు.

దుండుకః-పు॥ ఇది దుండిగపుమ్రానికిని, క్రూరునికిని పేరు.

వృషాంకః-పు॥ఇది శివునికిని, సజ్జనునకును పేరు.

ఏష్యత్కాల ఫలయో
దర్క స్స్యా
ద థాత్మజే, మదాలసా
గాం శ్వేతార్కేఽప్యల
ర్కో భ్రాన్తశున్యపి. ౩

ఉదర్కః-పు॥ ఇది రాఁబోవుకాలమునకును, కలుగఁబోవు ఫలమునకును పేరు.

అలర్కః-పు॥ ఇది కుమారునికిని, మదాలసయను నప్సరసకును, తెల్లజిల్లేడుచెట్టునకును, వెఱ్ఱిపట్టినకుక్కకును, అపిశబ్దముచేత అలర్కుఁడను రాజునకును పేరు.

కఞ్చుకీ వారవాణీ చ
దివౌకా శ్చాతకే సురే.
మశకః క్షుద్రరోగేఽపి
నరకో దానవేఽపిచ. ౪

కంచుకీ - న్-పు॥ ఇది కవచధారికిని, చకారమువలన సర్పమునకును పేరు.

దివౌకాః-న్-పు॥ ఇది చాతకపక్షికిని, దేవతకును పేరు.

మశకః - పు॥ ఇది క్షుద్రరోగమునకును, అపిశబ్దమువలన దోమకును పేరు.

నరకః - పు॥ ఇది రాక్షసునికిని, అపిశబ్దమువలన నరకమునకును పేరు.

చుళకః ప్రసృతౌ భాణ్డే
పృథుక శ్చిపిటే శిశౌ,
క్షురకః కోకిలాక్షే స్యా
త్క్షురే తిలకద్రుమే. ౫

చుళుకః - పు॥ ఇది పిడికిలికిని, మృణ్మయాది పాత్రమునకును పేరు.

పృథుకః - పు॥ ఇది అటుకులకును, శివునకును పేరు.

క్షురకః - పు॥ ఇది గొలిమిడిచెట్టునకును, పల్లేరుచెట్టునకును, తిలకపుచెట్టునకును పేరు.

రుచకో మఙ్గళద్రవ్యే ద
కణ్ఠ విభూషణే, ఏరణ్డే
మాతులుఙ్గే చ సౌవర్చలవిశ
యోః. ౬

రుచకః-పు॥ ఇది మంగళద్రవ్యమునకును, దంతమునకును, కంఠమునకును, భూషణమునకును, ఆముదపుచెట్టునకును, మాదీఫలమునకును, సౌవర్చలవణమను పేరుగల యుప్పునకును, వాయువిళంగమునకును పేరు.

శిశుక శ్శింశుమారే స్యా
ద్బాలకోలూపినో రపి,

శిశుకః - ॥పు॥ ఇది మొసలికిని, బాలునికిని, ఉలసమీనున కును పేరు.

భేర్యాం మృదఙ్గే పటహే
ధ్వనన్మేఘేఽపి చాతకః. ౭

చాతకః - ॥పు॥ ఇది భేరికిని, మద్దెలకును, తమ్మటకును, గర్జించుమేఘమునకును, (అపిశబ్దమువలన చాతకపక్షికిని పేరు.

చర్చిక్యే మౌక్తికాదీనాం
బుద్బుదే స్థానకోఽథ వేత్,

స్థానకః-॥పు॥ఇది కుంకుమ మొదలైన పూఁతకును, ముత్యము మొదయినవాని బుగ్గలకును పేరు.

క్రముక శ్శ్వేతలోధ్రే చ
పూగే చ బ్రహ్మదారుణి. ౮

క్రముకః - ॥పు॥ ఇది తెల్లలొద్దుగ చెట్టునకును, పోక చెట్టున కును, గంగరావిచెట్టునకును పేరు.

ప్రియకోఽళౌ మృగే నీ
పే ప్రియంగౌ కుఙ్కుమే
ఽసనే,

ప్రియకః - ॥పు॥ ఇది తుమ్మెదకును, కంబళమృగమునకును, కడిమిచెట్టునకును, గారెచెట్టునకును, కుంకుమకును, వేఁగిమ్రానున కును పేరు.

పిణ్యాక స్సిల్హకే కిణ్వే
శ్రీవాసతిలకల్కయోః. ౯

పిణ్యాకః - ॥పు॥ ఇది అందుగుబంకలైన సుగంధద్రవ్యముల చేతఁ జేయఁబడిన ధూపమునకును, పాపమునకును, సరళ దేవ దారుబంకకును, గానుగుపిండికిని పేరు.

స్యా త్పులాకస్తు సంక్షే
పే తుచ్ఛ ధాన్యాన్న సిక్థ
యోః,

పులాకః - ॥పు॥ ఇది సంక్షేపమునకును, తుచ్ఛధాన్యమున కును, మెతుకునకును పేరు.

గజలాంగూల మూలస్య
ప్రాన్తే ఘూకే చ పేచకః.

పేచకః - ॥పు॥ ఇది ఏనుఁగుతోఁక మొదటి సమీపమున కును, గుడ్లగూబకును పేరు.

వైధవేయే భగ్నభాణ్డే
శిరస్త్రే మణికే గుడే, కమ్బ
ళే చేన్ద్రియస్థానే పూగ కో
శే చ గోళకః. ౧౧

గోళకః - ॥పు॥ ఇది విధవాపుత్రునికిని, కడవబొచ్చెకును, కిరీటమునకును, మణికిని, బెల్లమునకును, కంబళికిని, చక్షురాదీం ద్రియస్థానములకును, పోఁకమొగ్గకును పేరు.

కూపకోఽన్ధౌ తైలపాత్రే
గుణవృక్షే కుకున్దరే,

కూపకః - ॥పు॥ ఇది బావికిని, తైలపాత్రమునకును, ఓడ మీఁద తెక్కముకట్టెడు స్తంభమునకును, ఆఁడుదాని పిఱుఁదుల మీఁదనుండు గుంతలకును పేరు.

శమ్బూకో గజకుమ్భాణ్డే
జలశుక్తౌ చ దానవే. ౧౨

శంబూకః-॥పు॥ ఇది ఏనుఁగు కుంభస్థలముయొక్క పుద్దల కును, కప్పచిప్పలకును, రాక్షసునికిని పేరు.

కీచకః పవనాపూరధ్వన
ద్వేణ్వసురాంశజే,

కీచకః - ॥పు॥ ఇది గాలినిండుటచేత ధ్వనించెడి బొంగు వెదు రునకును, కీచకుండను దానవాంశజునకును పేరు.

శూకకీటే రాశిభేదే వృ
శ్చికోఽ

వృశ్చికః - ॥పు॥ ఇది కణుదురునకును, రాశి భేదమునకును, మఱియును-తేలునకును పేరు.

థ గృహాన్తరే. ౧౭. ము
గ్ధ స్త్రీహస్తవిన్యాస భేదే
చ స్వస్తికో మతః,

స్వస్తికః-॥పు॥ ఇది ద్వారభేదములచేతఁ జేయఁబడిన రాజగృహములరచనాభేదమునకును, ముగ్ధస్త్రీయొక్క హస్తవిన్యాసభేదమునకును పేరు.

స్యాత్కఞ్చుకో వార
బాణే నిర్మోకే కవచేఽపి చ.

కఞ్చుకః-॥పు॥ ఇది కుబుసమువలె మేనికిమఱుఁగైనబొందలమునకును, పాముకుబుసమునకును, కవచమునకును పేరు.

నిర్మోకో వర్మణి వ్యోమ్ని
మోచనే సర్పకఞ్చుకే,

నిర్మోకః-॥పు॥ ఇది కవచమునకును, ఆకాశమునకును, విడుచుటకును, పాముయొక్కకుబుసమునకును పేరు.

పులకో మణిదోషే స్త్రీ
రాజ్యాం రోమోద్గమే క్రి
మౌ. ౧౮. హీరకేఽప్య

పులకః-॥పు॥ ఇది మణిదోషమునకును, పఙ్క్తికిని, గగ్గురుపాటునకును, పురుగునకును, వజ్రమునకును పేరు.

థ పార్శ్వంచ పక్షద్వా
రఞ్చ పక్షకం,

పక్షకమ్-॥న॥ ఇది పార్శ్వమునకును, దిడ్డివాఁకిలికిని పేరు.

కటుతుంబ్యా మపీక్ష్వాకు
స్తురుష్కః స్సిల్హకేఽపి చ.
౧౯

ఇక్ష్వాకుః-॥పు॥ ఇది వెఱ్ఱిసొరకాయకును, అపిశబ్దముచేత [నిక్ష్వాకుమహారాజునకును పేరు.

తురుష్కః-॥పు॥ ఇది తురుష్కదేశమునఁబుట్టిన యందుగుబంకకును, అపిశబ్దమువలన తురుష్కునికిని పేరు.

భుజఙ్గచిత్రకవ్యాఘ్ర వృ
శ్చికా స్స్యుః పృదాకవః,

పృదాకుః-॥పు॥ ఇది సర్పమునకును, చిత్తరువుఱ్ఱాయుం వానికిని, పెద్దపులికిని, తేలునకును పేరు.

మర్కటార్క వరోత్తాపి
హవ్యవాహాశ్చ పావకాః.

పావకః-॥పు॥ ఇది కోఁతికిని, సూర్యునికిని, పరులవ్యథపెట్టువానికిని, అగ్నికిని పేరు.

తార్క్ష్యభూపాలమార్జార
శలభా స్స్యు స్త్రిశంకవః,

త్రిశంకుః-॥పు॥ ఇది గరుత్మంతునికి, త్రిశంకుమహారాజునకును, పిల్లికిని, మిడతకును పేరు.

బ్రుసీ మఞ్చౌ తు పర్యంకౌ

పర్యఙ్కః-॥పు॥ ఇది యత్యాదులపీఠమునకును, మంచమునకును పేరు.

కరఙ్కో మస్తకాస్థని.
నారికేళఫలేఽపి స్యా

కరఙ్కః-॥పు॥ ఇది తలపుఱ్ఱెకును, టెంకాయకును పేరు.

త్కళఙ్కః స్త్వఙ్కః నిన్ద
యోః,

కళఙ్కః-॥పు॥ ఇది గుఱుతునకును, నిందకును పేరు.

ఆతఙ్క స్సంజ్వరే రోగే
సాధ్వసే మురజధ్వనౌ,

ఆతఙ్కః-॥పు॥ ఇది సంతాపమునకును, రోగమునకును, భయమునకును, మ్దలనగ్రోవిధ్వనికిని పేరు.

కణ్టకః పులకే వేణౌ ద్రు
మాఙ్గే క్షుద్రవైరిణి,

కణ్టకః-॥పు॥ ఇది గగ్గురుపాటుకును, వెదురునకును, ముంటికిని, క్షుద్రశత్రువునకును పేరు.

విపాకః పరిణామే చ స్వే
దనే దుర్గతావపి. ౨౦

విపాకః-॥పు॥ ఇది పరిపక్వమునకును, చెమటపోయుటకును, దుర్గతికిని పేరు.

కః పచనే స్వేదే
కేఽప్య
శికాః, గుగ్గులూలూక
ఽనిశక్రా హి తుణ్డి
౨౧
కామాతులీగౌర్యోః
మాతరిమాతరి,
ం కాలే చ ఘటికా
గా కర్ణభూషణే. ౨౨
ధ్యాఙ్గులౌ హా స్తి
ఽబ్జవరాటకే.
పిణ్డకే జఙ్ఘామాం
కాళికా. ౨౩. కా
వాన్యాం రోమాళీ
జలదాళిషు, షట్కో
గిన్యోః శ్నా శేమాం
ప్పుదే. ౨౪
వహ్నిమన్థే స్యా
ధూమచూర్ణకే,
క్ష్యకూర్చికాతూల
రపి తూలికా.
కాలమాం నీలిన్యాం
గేఽపి నీలికా,
ప్రియాయాం చ
ణౌ చ రేణుకా.
మృత్పాత్రభేదే చ
స్యే చ మల్లికా,
తూలికా సూ
స్తుపడ్జే చ కూర్చి
౨౫
యే తరఙ్గే చ వ

నిపాకః.॥పు॥ ఇది పచనమునకును, చెమటకును, దుష్టఫలమునకును పేరు.

కౌశికః -॥పు॥ ఇది గుగ్గిలపుచెట్టునకును, గుడ్లగూబకును, ముంగిసకును, కౌశికమునికిని, ఇంద్రునికిని, పాములవానికిని పేరు.

అంబికా-॥స్త్రీ॥ ఇది మేనమామభార్యకును, గౌరికిని, పాండురాజుతల్లికిని, తల్లికిని పేరు.

ఘటికా-॥స్త్రీ॥ ఇది ఏనుఁగునుగట్టునట్టిగొలుసునకును, గడియకును పేరు.

కర్ణికా-॥స్త్రీ॥ ఇది కర్ణభూషణమునకును చేతినడిమివ్రేలికిని, ఏనుఁగుయొక్క తొండముకొనకును, తామరపుష్పములోని దుద్దునకును పేరు.

పిండికా -॥స్త్రీ॥ ఇది తురుష్కదేశమునఁబుట్టిన అందుగుబంకకును, పిక్కలలోనుండు మాంసవిశేషమునకును పేరు.

కాళికా-॥స్త్రీ॥ ఇది స్వర్ణాదిధాతుదోషమునకును, పార్వతికిని, నూఁగారునకును, ధూమపఙ్క్తికిని, మేఘపఙ్క్తికిని, చేఁదుపొట్లతీఁగెకును, యోగికిని, కాఁడకును, మాంసవిశేషమునకును, క్రొమ్మెఱుఁగునకును పేరు.

కణికా-॥స్త్రీ॥ ఇది నెల్లిచెట్టునకును, లేశమాత్రమునకును, గోధూమలపిండికిని పేరు.

తూలికా-॥స్త్రీ॥ ఇది చిత్తరువువ్రాయుపుల్లకును, ప్రత్తివేసిన పరుపునకును పేరు.

నీలికా-॥స్త్రీ॥ ఇది నల్లవావిలిచెట్టునకును, నీలిచెట్టునకును,రోగభేదమునకును పేరు.

రేణుకా-॥స్త్రీ॥ ఇది జమదగ్నిభార్యకును, అగ్నితుషకును, ధూళికిని పేరు.

మల్లికా-॥స్త్రీ॥ ఇది మత్స్యవిశేషమునకును, మృత్పాత్రభేదమునకును, మల్లెతీఁగెకును పేరు.

కూర్చికా-॥స్త్రీ॥ ఇది మొగ్గకును, చిత్తరువువ్రాయుపుల్లకును, సూదికిని, జున్నునకును పేరు.

ఊర్మికా-॥స్త్రీ॥ ఇది ఉంగరమునకును, అలకును, వస్త్రము

స్త్రీభఙ్గేఽపి చోర్మికా,
మృద్వీకాఙ్గభేదే కాంతా
యాం కరభస్యాపి చోష్ట్రి
కా. ౨౮

ధేనుకా గౌః కరేణుశ్చ
కాముకా కాముకీ వధూః,
భిత్తికా తు శతావర్యాం
వజ్రే చాప్య

థ నాడికా. ౨౯. నాళే
కాలే ఘుల్లిరన్ధ్రే వివరే వేణు
భాజనే,

య స్స్యఘుః కర్మభావో
వా వృద్ధానాం తత్ర వార్ధ
కమ్. ౩౦

ధైనుకం ధేనుబృన్దే స్యా
ద్రతిబన్ధాన్తరేఽపి తత్,
భూతికం కత్తృణే దీపే
భూనిమ్బే భూస్తృణేఽ
పి చ. ౩౧

పుష్పకం రత్నవలయే శ్రీ
దయానే రసాఞ్జనే,
ఉత్తరీయే వస్త్రమాత్రే
సూక్ష్మవస్త్రేఽపి చాంశు
కమ్. ౩౨

అప్రియే ప్యనృతేఽళీకం
గజబిన్దౌ చ పద్మకమ్,

వ్యళీకం దుఃఖవైలక్ష్యా
ప్రియాకార్యే ష్వ

థాన్వయే. ౩౩. శీలే ప్య
నూకం

శస్త్రేఽపి కార్ముకం చా

యొక్క కుచ్చిళ్లకును పేరు.

ఉష్ట్రికా.॥స్త్రీ॥ ఇది మట్టికుండలలో నొకభేదమునకును, ఆఁడ యొంటెకును పేరు.

ధేనుకా.॥స్త్రీ॥ ఇది ఆవునకును, ఆఁడయేనుఁగునకును పేరు.

కాముకా.॥స్త్రీ॥ ఇది కామముగల యువతికిని పేరు.

భిత్తికా.॥స్త్రీ॥ చల్లగడ్డకును, వజ్రమునకును, చకారమువలన గోడకును పేరు.

నాడికా.॥స్త్రీ॥ ఇది కాఁడకును, కాలభేదమునకును, ప్రాయిసందునకును, రంధ్రమునకును, వేణుపాత్రకును పేరు.

వార్ధకమ్.॥న॥ ఇది పెద్దలసమూహమునకును, వారుచేయు కర్మకును వారిభావమునకును పేరు.

ధైనుకమ్.॥న॥ ఇది ఆవులయొక్క గుంపునకును, కళాశాస్త్రమునందు చెప్పియున్న బంధవిశేషమునకును పేరు.

భూతికమ్.॥న॥ ఇది కామంచికసవునకును, ఓమమునకును నేలవేమునకును, చీఁపురుకసవునకును పేరు.

పుష్పకమ్.॥న॥ ఇది రత్నములు చెక్కిన కడియమునకును కుబేరునివిమానమునకును, కుసుమాంజనమునకును పేరు.

అంశుకమ్.॥న॥ ఇది ఉత్తరీయమునకును, సామాన్యవస్త్రమునకును, సూక్ష్మవస్త్రమునకును పేరు.

అళీకమ్.॥న॥ ఇది అనిష్టమునకును, అనృతమునకును పేరు.

పద్మకమ్.॥న॥ ఇది ఏనుఁగు సిబ్బెమునకును, చకారమువల కమలమునకును పేరు.

వ్యళీకమ్.॥న॥ ఇది దుఃఖమునకును, ఆశ్చర్యముతోఁగూడునకును, అప్రియమునకును, అకార్యమునకును పేరు.

అనూకమ్.॥న॥ ఇది కులమునకును, స్వభావమునకును పేరు.
[స్సు]నకును పేరు

కార్ముకమ్.॥న॥ ఇది ఆయుధమునకును, అపిశబ్దమువలన ధ

థ కౌతుకం, కుతుకేచ్ఛా హస్తసూత్రమఙ్గళేతి హ్యాన ర్మసు. ౩౪. ప్రఖ్యాతహర్షయో శ్చా

కౌతుకమ్-॥న॥ ఇది అపూర్వవస్తువును గోరుటకును, యిచ్ఛకును, వివాహోదులయందు హస్తమునఁగట్టుకంకణమునకును, శుభమునకును, యిట్లనిగదా పారంపర్యము గలదనుటకును, క్రీడకును, ప్రసిద్ధికిని, సంతోషమునకును పేరు.

థ స్వర్ణేథాతౌ చ గైరికమ్.

గైరికమ్-॥న॥ ఇది బంగారమునకును, గంధకాదిధాతువులకును [పేరు.

కటుకం కటురోహిణ్యాం త్ర్యూషే చా

కటుకమ్-॥న॥ ఇది కటుకరోహిణికిని, శొంఠి, పిప్పలి, మిరియాలకూటమికిని పేరు.

ర్భకస్త్రిషు. ౩౫ దరిద్రే బాలకే మూర్ఖే జడేభ్రూణే తు పుంస్యయమ్,

అర్భకః - ఇది దరిద్రునకును, బాలునికిని, మూర్ఖునకును, వివేకశూన్యునకును పేరగునపుడు ॥త్రి॥ స్త్రీలగర్భమునకును పేరగునపుడు ॥పు॥

చిత్రకం తిలకే నాతువ్యాఘ్రే వహ్న్యాఖ్యభేషజే.

చిత్రకమ్-ఇది తిలకమునకుఁ బేరగునపుడు ॥న॥ పెద్దపులికిని చిత్రమూలమునకును బేరగునపుడు ॥పు॥

ఏరణ్డే సరకం త్వస్త్రీ శీధౌ తత్పాత్రపానయోః,

సరకమ్-ఇది ఆముదపుచెట్టునకును బేరగునపుడు ॥న॥మద్యమునకును,దానిపాత్రమునకును,దానిత్రావుటకును బేరగునపుడు ॥ప్న॥

వాలకం స్యా దంగులీయే హ్రీబేరే వలయేఽపిచ. ౩౬ శిశౌ తు త్రిషు

వాలకమ్-ఇది ఉంగరమునకును, కురువేరునకును, కడియమునకును బేరగునపుడు ॥న॥ శిశువునకుఁ బేరగునపుడు ॥త్రి॥

నాళీకం త్వబ్జే క్లీబం శరే పుష్కరా

నాళీకమ్-ఇది కమలమునకును బేరగునపుడు ॥న॥ బాణవిశేషమునకుఁ బేరగునపుడు ॥పు॥

ఖే కిఞ్జల్కం కేసరే నా

కింజల్కమ్-ఇది ఆకాశమునకుఁ బేరగునపుడు ॥న॥ ఆకరపుప్పొడులకుఁ బేరగునపుడు ॥పు॥

సూతకః పారదే పుమాన్. ౩౭. ఆశౌచే సూతకం

సూతకః-ఇది పాదరసమునకును బేరగునపుడు ॥పు॥ అశౌచమునకుఁ బేరగునపుడు ॥న॥

ధుర్ల్యా మన్తికా నికటేఽన్తికమ్,

అంతికా-ఇదిప్రాయికిఁ బేరగునపుడు ॥స్త్రీ॥ సమీపమునకు బేరగునపుడు ॥న॥

కనకం కాఞ్చనే నాతు ధుత్తూరే నాగకేసరే. ౩౮. చమ్పకే కాఞ్చనాహ్వే చ

కరకమ్-ఇది బంగారమునకుఁ బేరగునపుడు ॥న॥ ఉమ్మెత్తచెట్టునకును, నాగకేసరమునకును, సంపెంగచెట్టునకును, దేవకాంచనపుచెట్టునకును బేరైనప్పుడు ॥పు॥

కరకస్తు కమణ్డలౌ, దాడిమే పక్షిభేదే చ ద్వయోః శేష ఘనోపలే. ౪౦

కరకః-॥ప్న॥ ఇది కమండలమునకును, దానిమ్మచెట్టునకును పక్షివిశేషమునకును, వడిగండ్లకును పేరు.

చటకః కలవిఙ్కః స్యా త్తస్య కాన్తా స్త్ర్యపత్యయోః, చటకా

చటకః-ఇది పిచ్చుకకుఁ బేరగునపుడు ॥పు॥ ఆఁడుపిచ్చుకకును, దానియాఁడుపిల్లకును పేరైనపుడు ॥స్త్రీ॥

కులకస్తు స్యా ద్వల్మీకే కాకతిన్దుకే. ౪౧. క్లీబే త్వేకాన్వయశ్లోకబృన్దే

కులకః-ఇది పుట్టకును, నల్లతుమ్మికచెట్టునకును పేరగునపుడు ॥పు॥ ఒక క్రియలో నన్వయించునట్టి శ్లోకములసముదాయమునకును పేరైనపుడు ॥న॥

క్లోమ్ని తు చిత్రకే, తిలకం ద్రుమరోమాశ్వభేదేషు తు పుమా నయమ్. ౪౨

తిలకమ్-ఇది కడుపులోనుండు నీరుతిత్తికిని నుదుటఁబెట్టు బొట్టునకును పేరైనపుడు ॥న॥ తిలకపుచెట్టునకును, రోమమునకును, అశ్వభేదమునకును పేరైనపుడు ॥పు॥

ఆఢకం స్యా న్మానభేదే తు వర్యా మాఢకీ స్త్రియామ్,

ఆఢకమ్-ఇది తూమునకుఁ బేరగునపుడు ॥న॥ తొవరిమన్నెయను మూలికకుఁ బేరగునపుడు-ఆఢకీ ॥స్త్రీ॥ ఇది కందిచెట్టునకుఁ బేరగునని కొంద ఱందురు.

పినాకో ఽస్త్రీ పాంసువర్షే త్రిశూలే శివధన్వని.

పినాకః - ॥ప్న॥ ఇది మట్టివానకును, త్రిశూలమునకును, శివునివింటికిని పేరు.

ప్రతీక స్స్యా దవయవే ప్రతికూలే త్వయం త్రిషు,

ప్రతీకః-ఇది అవయవమునకుఁ బేరగునపుడు ॥పు॥ ప్రతికూలమునకు పేరగునపుడు ॥త్రి॥

వల్మీకో ఽస్త్రీ రోగభేదే

వల్మీకః - ॥ప్న॥ ఇది కాలియందుపుట్టువలె పుట్టెడురోగవిశేషమునకును, అపిశబ్దముచేత పుట్టకును పేరు.

ప్యనీకో ఽస్త్రీ రణే బలే.

అనీకః-॥ప్న॥ ఇది యుద్ధమునకును, సేవకును పేరు.

మణ్డూకపర్ణ్యాం మణ్డూకీ పుమాన్ శోణకభేదయోః,

మండూకీ - ఇది మంజిష్ఠకుఁ బేరైనపుడు ॥స్త్రీ॥ దుండిగపు మ్రానికిని, కప్పకును బేరగునపుడు-మండూకః ॥పు॥

గ్రన్థికం పిప్పలీమూలే పుంస్యయం గుగ్గులుద్రుమే. ౪౩

గ్రంథికమ్-ఇది మోడికిఁ బేరగునపుడు ॥న॥ గుగ్గిలపుచెట్టునకుఁ బేరగునపుడు ॥పు॥

బాహ్లీకం కుఙ్కుమే హింగౌ దేశభేదాశ్వయోస్తు నా,

బాహ్లీకమ్ - ॥పా॥ పాహ్లీకమ్ - ఇది కుంకుమపువ్వునకును, ఇంగువకును బేరగునపుడు ॥న॥ దేశవిశేషమునకు, బాహ్లీకదేశపు గుఱ్ఱమునకును బేరగునపుడు ॥పు॥

కన్యయా యద్ధనం లబ్ధం పిత్రాదేస్తత్ర యౌతకమ్. ౪౪. యౌతక స్యేద మిత్యత్ర త్రిష్వయం

యౌతకమ్ - ఇది కన్యకు తండ్రి మొదలైనవారివలన లభించిన ధనమునకుఁ బేరగునపుడు ॥న॥ యౌతకసంబంధమైనదన నర్థమున ॥త్రి॥

యౌతకం త్విహ, యౌతకే యుగళే యుక్తే సంశ్ర

యౌతకమ్-॥న॥ ఇది స్త్రీధనమునకును, జంటకును, కూడిదానికిని, ఆశ్రయించుటకును, శోకచెఱఁగునకును, చేటనాలు

యే వసనాఞ్చలే. శూర్పాగ్రే
వస్త్రభేదేచ స్త్రీణాం
నద్యాం తు గణ్డకీ, స్యా
ద్గణ్డకః ఖడ్గమృగే ప్ర
త్యూహే శకులార్భకే. ౪౮
మేచక శ్చన్ద్రికే ధ్వాన్తే
నీలే నా తద్వతి త్రిషు,
మధుక స్స్యా ద్వన్దిజనో
మధుకం మధుయష్టికా. ౪౯
జతుకా జనపత్ర్యాయాం
జతుకం హిఙ్గులాక్షయోః,
కుమార్యాం నగ్నికా వన్ది
పక్షిణౌ నగ్నికావుభౌ. ౫౦
వాలుకా సికతాసు స్యా
త్క్ష్వేలే చ హరివాలుకే,
మోచకః కదళీ శిగ్రో
స్సేచకోఽమ్బుధరేఽపిచ. ౫౧
జతుకా కాశ్య సూచీషు
సూచకో వాచ్యవత్ఖలే
క్షారకః పక్షిమత్స్యాదిపి
టకే పుష్పజాలకే. ౫౨
భక్ష్యేఽపి మోదకః
కావ్యాలఙ్కారేఽపి చ
దీపకమ్,
రూపకం వాగలఙ్కారే
నాటకే ప్య
థ జీవకః. ౫౩. క్షపణే
వృద్ధిజీవి న్యహ్యసనే చాహి
తుణ్డికే, స్యాద్దాజీవే జీవి

కును, ఒకరకముబట్టకును పేరు.

గండకీ-॥స్త్రీ॥ ఇది నదికి పేరు.

గండకః -॥పు॥ ఇది ఖడ్గమృగమునకును, విఘ్నమునకును, మీను పిల్లకును పేరు.

మేచకః-॥పు॥ ఇది నెమలిపురికంటికిని, చీఁకటికిని, నలుపునకును పేరగునపుడు నలుపుగలదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

మధుకః-ఇది భట్టువాండ్రు మొదలైనస్తుతిపాఠకులకుఁ బేరగునపుడు ॥పు॥ అతిమధురమునకుఁ బేరైనపుడు ॥న॥

జతుకా-ఇది చీకురువాయియనుపక్షికిఁ బేరగునపుడు ॥స్త్రీ॥ ఇంగువకును, లత్తుకకును బేరయినపుడు ॥స్త్రీ॥

నగ్నికా-ఇది సమర్తాడని కన్యకకుఁ బేరగునపుడు ॥స్త్రీ॥ స్తుతిపాఠకునికిని, పక్షివిశేషమునకును పేరగునపుడు ॥పు॥

వాలుకా-॥స్త్రీ॥ ఇది ఇసుకకును, అగ్నిజ్వాలకును, నూఁగుదోసచెట్టునకును పేరు.

మోచకః-॥పు॥ ఇది అరఁటిచెట్టునకును, మునగచెట్టునకును పేరు.

సేచకః-॥పు॥ ఇది మేఘమునకును, అపిశబ్దమువలన తడిపెడివానికిని పేరు.

సూచకః-ఇది చీకురువాయి యనుపక్షికిని, మధ్యమునకును, సూదికిని బేరగునపుడు ॥పు॥ దుష్టునికి పేరగునపుడు విశేష్యలింగము.

క్షారకః- ॥పు॥ ఇది పక్షిమత్స్యాదులం వేయుబుట్టకును, పసరుమొగ్గకును నామము.

మోదకః-॥పు॥ ఇది భక్ష్యవిశేషమునకును, అపిశబ్దమువలన సంతోషకరమైనదానికిని నామము.

దీపకమ్-॥న॥ ఇది కావ్యాలంకారమునకును, అపిశబ్దమువలన ప్రకాశమైనవానికి నామము.

రూపకమ్-॥న॥ ఇది వాగలంకారమునకును, నాటకమునకును నామము.

జీవకః-ఇది హరించుటకును, వడ్డీవల్లజీవించేవానికిని, వేఁగిమ్రానికిని, పాములవానికిని బేరైనపుడు ॥పు॥ జీవనోపాయమునకుఁ బేరయినపుడు జీవికా ॥స్త్రీ॥

**కా** స్త్రీ

తున్నవాయే చ సౌచికః.

సౌచికః-॥పు॥ ఇది కుట్రపువానికి నామము.

జనకో మైథిలేఽపి స్యా

జనకః-॥పు॥ ఇది జనకమహారాజునకును, అపిశబ్దమువల తండ్రికిని నామము.

ద్రజకో ధావకే శుకే,

రజకః-॥పు॥ ఇది చాకలికిని, చిలుకకును నామము.

ద్రవక స్త్రీ ష్వభిజ్ఞే నా శిలాభేదేఽ

ద్రవకః-ఇది అభిజ్ఞునికిఁ బేరగునపుడు॥త్రి॥శిలాభేదమునక బేరగునపుడు ॥పు॥

థ లాసకః. ౫౭. మయూరే లాస్యకారే చ

లాసకః-॥పు॥ నెమలికిని, నట్టువవానికిని నామము.

తక్షకౌ నాగవర్ధకౌ,

తక్షకః-॥పు॥ ఇది సర్పవిశేషమునకును, వడ్లవానికిని పేరు.

పావకోఽగ్నౌ సదాచారే భల్లాతకవిడఙ్గయోః. అగ్నిమన్థే చిత్రకే చ

పావకః-॥పు॥ ఇది అగ్నికిని, సదాచారమునకును, జీడిమ్రా కిని, వాయువిడంగమునకును, నెల్లిచెట్టునకును, చిత్రమూలమ కును నామము.

దారకస్తు శిశౌ వపి,

దారకః-॥పు॥ ఇది శిశువునకును, అపిశబ్దమువలన నరికె వానికిని నామము.

హారకౌ చోరకితవౌ

హారకః-॥పు॥ ఇది చోరునకును, జూదగానికిని నామము.

కర్త్రాదావపి కారకమ్. ౫౮

కారకః-॥పు॥ ఇది కర్తృకర్మకరణాదులకు నామము.

స్యాత్కారికా యాతనాయాం శ్లోకే వివరణే కృతౌ,

కారికా-॥స్త్రీ॥ ఇది వేదనకును,శ్లోకమునకును, సూత్రార్థమ దెలుపువాక్యమునకును, చేయుటకును నామము.

వర్ణకోఽస్త్రీ ప్రకారే స్యాచ్చన్దనేఽఙ్గవిలేపనే.

వర్ణకః-॥పు॥ ఇది ప్రకారమునకును, శ్రీగంధమునకు కుంకుమాదులచేతఁ జేయఁబడిన మైపూఁతకును నామము.

లోచకస్త్వజ్ఞేమాంసపిణ్డే రక్తాంశుకే భ్రువి,

లోచకః-॥పు॥ ఇది కాటుకకును, మాంసపిండమునకును, నివస్త్రమునకును, కనుబొమ్మకును పేరు.

నన్దకో విష్ణుఖడ్గేఽపి

నందకః-॥పు॥ ఇది విష్ణువుయొక్క కత్తికిని, అపిశబ్దమున సంతోషపెట్టువానికిని పేరు. [చూపువానికిని పే

ప్రతీహారేఽపి దర్శకః.

దర్శకః - ॥పు॥ ఇది ద్వారపాలకునికిని అపిశబ్దమున

వర్తకోఽశ్వఖురః పక్షీ

వర్తకః-॥పు॥-ఇది గుఱ్ఱపుగొరిసెకును, పెలిచెపిట్టకును పేర

సాయకశ్శరఖడ్గయోః,

సాయకః-॥పు॥ ఇది బాణమునకును, కత్తికిని పేరు.

కరేణ్వసత్యోర్బన్ధక్యౌ

బంధకీ-॥స్త్రీ॥ ఇది ఆఁడయేనుఁగునకును, వ్యభిచారిణికిని పే

రాధిద్రవ్యే తు బన్ధకః.

బంధకః-॥పు॥ ఇది కుదువపెట్టినసొమ్మునకు పేరు.

యాజకో రాజమాతఙ్గే వ్య

యాజకః-॥పు॥ ఇది రాజుయొక్క యేనుఁగునకును,

శబ్దమువలన ఋత్విజునకును పేరు.

**యస్కాన్తేఽపి చుమ్బకః,**

చుంబకః-॥పు॥ ఇది సూదంటురాతికిని, అపిశబ్దమువలన ముద్దుపెట్టువానికిని పేరు.

రాజకం రాజబృన్దేఽపి

రాజకమ్-॥న॥ ఇది రాజులకూటమికి పేరు.

రాజికా రాజసర్షపే. ౭౧

కేదారలేఖయో

రాజికా - ॥స్త్రీ॥ ఇది నల్లావాలకును, వరిమడికిని, రేఖకును పేరు.

శ్లాఘకరేణ్వా మజి న ర్తకీ,

నర్తకీ-॥స్త్రీ॥ ఇది ఆఁడుయేనుఁగునకును, అపిశబ్దమువలన నాట్యమాడు స్త్రీకిని పేరు.

ఆఖుచోరౌ తు ఖనకౌ

ఖనకః-॥పు॥ ఇది పందికొక్కునకును, కన్నము వేయుదొంగకును పేరు.

తారకా దైత్య నాసికా.

౭౨. కనీనికాయాం భేచా

యం వ నా చక్షుషి చ ద్వయోః,

తారకః-ఇది దైత్యునికిని, వడ్లవానికిని పేరగునపుడు ॥పు॥ నల్లగ్రుడ్డునకును, నక్షత్రమునకును పేరగునపుడు ॥స్త్రీ॥ కంటికిఁ బేరగునపుడు ॥న॥

గజవేశ్యా యూథికా చ

గణికా నాతు తాస్త్రికే.

గణికా-ఇది ప్రసిద్ధమైన వేశ్యకును, ఆడవిమొల్లకును పేరైనపుడు ॥స్త్రీ॥ కరణము చేయువానికి పేరైనపుడు ॥పు॥

మోచకాద్యా అమీ మో

క్తృమోచయిత్రాదిషు త్రి

షు,

మోచకాద్యాః=మోచకశబ్దము మొదలైన, అమీ=ఈక్రిందఁ జెప్పినశబ్దములు, మోక్తృమోచయిత్రాదిషు=విడిచినవానికిని, విడిపించినవానికిని పేరగునపుడు, త్రిషు=త్రిలింగములయందును వర్తించును. అనఁగా విశేష్యమేలింగమో విశేషణమాలింగమగును.

నీచేఽల్పే క్షుల్లకో

క్షుల్లకః-॥పు॥ ఇది నీచునకును, కొంచెమునకును పేరు.

ఽభీకః క్రూరే కామిని ని

ర్భయే. ౭౪

అభీకః-॥పు॥ ఇది క్రూరునికిని, కాముకునికిని, భయమువదలినవానికిని పేరు.

ఈర్ష్యాయుతే వఞ్చకే చ

కుహాక

కుహాకః-॥పు॥ ఇది ఓర్వలేనివానికిని, మోసగానికిని పేరు.

స్త్రీష్వమీ త్రిషు,

ఇతి కాన్తాః.

అమీ - ఈక్షుల్లకాదిశబ్దములు మూఁడును త్రిలింగములయందును వర్తించును.

కాంతపదవర్గము ముగిసెను.

---

మయూఖోఽంశుజ్వాల భాసు

మయూఖః-॥పు॥ కిరణమునకును, అగ్నిజ్వాలకును, కాంతికిని పేరు.

వైశాఖో మాసమన్థయోః.

వైశాఖః-॥పు॥ ఇది మాసమునకును, కవ్వమునకును పేరు.

రథ్యా ఖనిత్ర్యో ర్విశిఖా

విశిఖా-॥స్త్రీ॥ ఇది రాజమార్గమునకును, గుద్దలికిని పేరు.

స్త ద్రుమమన్మథాః,
తపనా గ్రీష్మభల్లాత నర
కాన్తరభాస్కరాః. ౨౩౫
సన్తానా స్స్యు రవిచ్ఛిత్తి
వంశాపత్యసురద్రుమాః,
తమోనుదో ఽగ్ని చన్ద్రా
ర్కా
శ్శకునీ రాజపక్షిణోః.
అరత్నిః కూర్పరే సప్ర
కోష్ఠోర్ధ్వాఙ్గుళి హస్తకే,
ఉదాన ముదరావర్తే సర్ప
మారుతభేదయోః. ౨౩౬
రఞ్జనీ రోచనా నీల్యో
ర్వన్దాయా మపి కామినీ,

పద్మినీ స్త్రీ దారవామ్బు
పాత్రేచ పశుభక్షణే.
హ్రాదినీ వజ్రతటితో
శ్శిఞ్జినీ నూపురజ్యయోః,
వాహినీ సైన్యసరితో
ర్వర్తనీ వృత్తిమార్గయోః.
పద్మినీ కరిణీ శ్రీ స్త్రీవరో
ష్వనలినీషుచ,
వాణినీ నర్తకీ మత్తా వి
దగ్ధా స్వ
థ మాలినీ. ౨౪౦. మాలా
కారస్త్రీయాం గౌర్యాం
స్వర్ణదీవృత్తభేదయోః,
సన్ధిన్యకాలదుగ్ధా గౌరా
క్రాంతా వృషభేనచ. ౨౪౧
పూతనా రాక్షసీ పథ్యా
భావనా ధ్యానయత్నయోః,

వసంతర్తువునకును, మంగచెట్టునకును, మన్మథునకును నామము.

తపనః - ।పు। ఇది గ్రీష్మర్తువునకును, జీడిమ్రానికిని, నరక విశేషమునకును, సూర్యునికిని నామము.

సంతానః - ।పు। ఇది ఎడతెగకయుండుటకును, వంశమునకును, పుత్రులకును, కల్పవృక్షమునకు నామము.

తమోనుత్ - ।పు।ఇది అగ్నికిని, చంద్రునికిని, సూర్యునికిని నామము.

శకునిః - ।పు। ఇది ఒకరాజునకును, పక్షికిని నామము.

అరత్నిః - ।పు। ఇది మోఁచేతికిని, చాఁపఁబడిన చిటికెన వ్రేలుఁగలపిడికిలితోఁగూడిన మూరకుఁబేరు.

ఉదానమ్ - ।పు। ఇది ఉదరమునఁబుట్టిన సుడికిని, సర్ప విశేషమునకును, కంఠదేశమునఁనుండు వాయువునకును పేరు.

రంజనీ-।స్త్రీ।ఇది గోరోచనమునకును, నీలిచెట్టునకును పేరు.

కామినీ - ।స్త్రీ। ఇది బదనికకును, అపిశబ్దమువలన విలాసిని యయిన స్త్రీకిని పేరు.

పద్మినీ - ।స్త్రీ। ఇది కొయ్యతోఁజేరిన యుదకపాత్రమునకును, యజ్ఞమునందు పశుభక్షణమునకును నామము.

హ్రాదినీ-।స్త్రీ। ఇది వజ్రాయుధమునకును, మెఱుపునకును పేరు.

శింజినీ - ।స్త్రీ। ఇది కాలియందెకును, నారికిని నామము.

వాహినీ - ।స్త్రీ। ఇది సేనయొక్క కూటమికిని, నదికిని పేరు.

వర్తనీ-।స్త్రీ।ఇది జీవనోపాయమునకును, కాలిత్రోవకును పేరు.

పద్మినీ - ।స్త్రీ। ఇది ఆఁడుయేనుఁగునకును, లక్ష్మికిని, పద్మినీ జాతిస్త్రీకిని, కొలనికిని, తామరతీఁగెకును నామము.

వాణినీ-।స్త్రీ। ఇది నాట్యమాడుస్త్రీకిని, మత్తురాలికిని, ప్రౌఢురాలికిని నామము.

మాలినీ - ।స్త్రీ। ఇది పువ్వులుగట్టి యమ్మువానికిని, భార్యకును, పార్వతికిని, గంగకును, మాలినీవృత్తమునకును నామము.

సంధినీ - ఇది ఈచుకపోయిన యావునకును, పదసై యాఁబోతుచేత వెంటాడఁబడిన యావునకును నామము.

పూతనా - ।స్త్రీ। ఇది రాక్షసస్త్రీకిని, కరకచెట్టునకును పేరు.

భావనా - ।స్త్రీ। ఇది ధ్యానమునకును, యత్నమునకును పేరు.

భువనం ఖామ్బు లోకేషు
భవనం భావ వేశ్మనోః.
నిధనం నాశ కులయో
ర్వసనం వాసవస్త్రయోః,
బన్ధోపరత్యో ర్దమనం
సేవనం స్యూతి సేవయోః. ౨౮3

భువనమ్ - ॥న॥ ఇది ఆకాశమునకును, ఉదకమునకును, లోకమునకును నామము.

భవనమ్-॥న॥ ఇది అభిప్రాయమునకును, గృహామునకును పేరు.

నిధనమ్-ఇది నాశమునకును, కులమునకును నామము.

వసనమ్-॥న॥ ఇది ఉనికికిని, వస్త్రమునకును నామము.

దమనమ్-॥న॥ ఇది కట్టుటకును, చాలించుటకును నామము.

సేవనమ్ - ॥న॥ ఇది కోకలు మొదలైనవానిం గట్టుటకును, కొలువుగొలుచుటకును నామము.

ప్రజ్ఞానం లాఞ్ఛనధియో
ర్దశనం దంశ వర్మణోః,
క్రన్దనం రోదనాహూత్యో
రోదనం క్రన్దనాశ్రుణోః,
ప్రసూనం పుష్పఫలయో
ర్లాఞ్ఛనం నామలక్ష్మణోః,

ప్రజ్ఞానమ్ - ॥న॥ ఇది గుఱుతునకును, బుద్ధికిని నామము.

దశనమ్-॥న॥ఇది కఱచుటకును, కవచమునకును నామము.

క్రందనమ్-॥న॥ ఇది ఏడ్చుటకును, పిలుచుటకును నామము.

రోదనమ్-॥న॥ ఇది ఏడ్చుటకును, కన్నీటికిని నామము.

ప్రసూనమ్-॥న॥ఇది పుష్పమునకును, ఫలమునకును నామము.

లాంఛనమ్ - ॥న॥ ఇది నామధేయమునకును, గుఱుతునకును పేరు.

స్తననం గర్జిత ధ్వన్యో
ర్గహనం వనదుఃఖయోః.
బన్ధనం బన్ధవధయో
ర్భాజనం యోగ్య పాత్ర
యోః,

స్తననమ్ - ॥న॥ ఇది మేఘగర్జితములకును, ధ్వనికిని నామము.

గహనమ్ - ॥న॥ ఇది అడవికిని దుఃఖమునకును నామము.

బంధనమ్-॥న॥ ఇది కట్టుటకును, చంపుటకును నామము.

భాజనమ్-॥న॥ ఇది యోగ్యమునకును, పాత్రకునునామము.

ఛేదనం కర్తనే భేదే
తోదనం తోత్రతోదయోః.
ప్రధనం దారణే యుద్ధే
మేహనం మూత్ర శేఫసోః,
ఉద్ధాన ముద్గమే చుల్ల్యా
మవనం ప్రీతిరక్షయోః.

ఛేదనమ్-॥న॥ ఇది ఛేదించుటకును, భేదమునకును నామము.

తోదనమ్-॥న॥ ఇది ముల్లుకఱ్ఱకును, పోవుటకును నామము.

ప్రధనమ్-॥న॥ ఇది కోయుటకును, యుద్ధమునకును నామము.

మేహనమ్-॥న॥ఇది మూత్రమునకును, శిశ్నమునకును నామము.

ఉద్ధానమ్ - ॥న॥ ఇది పైకిలేచుటకును, పొయికిని నామము.

అవనమ్-॥న॥ఇది సంతోషమునకును, రక్షించుటకును నామము.

శాసనం నిష్కర గ్రామే
నిగ్రహే వేదశాస్త్రయోః,
వాజ్ఞాయోగే ప్రహరణే
స్యాల్లేఖే కర్మవాక్యయోః

శాసనమ్ - ॥న॥ ఇది కప్పములేని గ్రామమునకును, నిగ్రహించుటకును, వేదశాస్త్రములకును, ఆజ్ఞకును, కొట్టుటకును, పత్రికకును, కర్మకును, వాక్యమునకును నామము.

స్యాన్నిదానం వత్సదామ
న్యాది కారణ ఖణ్డయోః,

నిదానమ్-॥న॥ఇది దూడ బలుపునకును, ఆదికారణమునకును, ఖండమునకును నామము.

కాలీనం సుకులీనత్వే ప్రాణి
ద్యూతాపవాదయోః.

కాలీనమ్-॥న॥ ఇది సత్కులవంతుఁడగుటకును, పశుపక్ష్యా గాదులయుద్ధమునకును, లోకాపవాదమునకును పేరు.

స్యాత్కౌపీన మకార్యే
చ గుహ్యచీరప్రభేదయోః,

కౌపీనమ్-॥న॥ అకార్యమునకును, గుహ్యమునకును, గోఁచి కిని పేరు.

బీజావాపేఽపి వపనం

వపనమ్-॥న॥ ఇది విత్తనము విత్తుటకును, అపిశబ్దమువలన గొఱుగుటకును పేరు.

హింసాయా మపి వర్జనమ్.

వర్జనమ్-॥న॥ ఇది హింసకును, అపిశబ్దమువలన విడుచుటకును [పేరు.

వర్ధనం ఛేదనేఽపి స్యా

వర్ధనమ్-॥న॥ ఇది ఛేదించుటకును, అపిశబ్దమువలన వృద్ధినొం దుటకును పేరు.

చ్చతుష్క్రోశే చ యోజ
నమ్,

యోజనమ్-॥న॥ ఇది ఆమడదూరమునకును, చకారమువల నొకవస్తువును మఱియొకదానితోఁ గూర్చుటకును పేరు.

రాశిభేదేఽపి మిథునం

మిథునమ్-॥న॥ ఇది రాశిభేదమునకును, అపిశబ్దమువలన స్త్రీ పురుషులజంటకును పేరు.

సంగతా వపి మైథునమ్.
౨౯౧

మైథునమ్-॥న॥ ఇది బంధమునకును, అపిశబ్దమువలన సుర మునకును పేరు.

తేమనం వ్యంజనే క్లీబే

తేమనమ్-॥న॥ ఇది మజ్జిగ, చారు, ఊరుపిండి మొదలై దానికి పేరు. [పే

సవ్యానం ఛాదనేఽంశుకే

సవ్యానమ్-॥న॥ ఇది ఉత్తరీయమునకును, కట్టువస్త్రమున

సవనం సోమనిష్పేషే జన
న స్నానయోరపి. ౨౯౨

సవనమ్-॥న॥ ఇది సోమలతను నూఱుటకును, పుట్టుటకు స్నానమునకును పేరు.

అయనం నిలయే మార్గే ద
క్షిణోదగ్గతౌ రవేః,

అయనమ్-॥న॥ ఇది స్థానమునకును, త్రోవకును, సూరు యొక్క యుత్తరదక్షిణగమనములకును పేరు.

జఘనం కామినీశ్రోణీపురో
భాగే కటిస్థలే. ౨౯౩

జఘనమ్-॥న॥ ఇది స్త్రీలయొక్క మొలకుముందఱిదిక్కు న్న ప్రదేశమునకును-అనఁగా మడికట్టునకును, పిఱుఁదులకును పే

ఆసనం కుఞ్జరస్కన్ధే పీఠే
యాత్రానివర్తనే,

ఆసనమ్ - ॥న॥ ఇది ఏనుఁగుమూఁపునకును, పీఠమునకు యుద్ధసమయమునను జూచుటకును పేరు.

దర్శనం దర్పణస్వప్నబుద్ధి
శాస్త్రాక్షిదృష్టిషు. ౨౯౪

దర్శనమ్-॥న॥ ఇది అద్దమునకును, స్వప్నమునకును, బుద్ధి శాస్త్రమునకును, కంటికిని, చూపునకును పేరు.

కేతనం గేహచిహ్నాఙ్గకృ
త్యామన్త్రణకేతుషు,

కేతనమ్-॥న॥ ఇది గృహమునకును, గుఱుతునకును, శరీ నకును, చేయఁదగినకార్యమునకును, బ్రాహ్మణుల నిమంత్రణ చేయుంటకును, టెక్కెమునకును పేరు.

ఉత్థాన ముద్గమాఽఽకాంక్ష

ఉత్థానమ్-॥న॥ ఇది కూర్చున్నవాఁడు లేచుటకును, ఆశా

తన్త్రే పౌరుషవస్తుషు. ౨౧౫

కును, తంత్రమునకును, పురుషప్రమాణమునకును, వస్తువునకును పే.

వ్యుత్థానం తు స్వతన్త్రత్వ
కరణం ప్రతికూలతా,

వ్యుత్థానమ్-॥న॥ ఇది స్వాతంత్ర్యముం జేయుంటకును, ప్రతికూలము చేయుంటకును పేరు.

ప్రధానం పరమాత్మాఽఽది
ర్మన్త్రీ ప్రకృతి రుత్తమః. ౨౧౬

ప్రధానమ్-॥న॥ ఇది పరమాత్మకును, మొదటికిని, మధ్యములై యాలోచనకుండఁదగిన మంత్రి సేనాపతి మొదలైనవారికిని, ప్రకృతికిని, ముఖ్యునకును పేరు.

ప్రస్థాపనే నిరసనే కాల
క్షేపే చ యాపనమ్,

యాపనమ్-॥న॥ ఇది పంపుటకును, తిరస్కారమునకును, కాలక్షేపమునకును పేరు.

ఉద్యానం స్యా న్నిస్సరణే
వనభేదే ప్రయోజనే. ౨౧౭

ఉద్యానమ్-॥న॥ ఇది గృహమునిడచి బైలుదేరుటకును, శృంగారపుఁదోఁటకును ప్రయోజనమునకును పేరు.

సంస్థాన మాకృతౌ మృ
త్యౌ సన్నివేశే చతుష్పథే,

సంస్థానమ్-॥న॥ ఇది ఆకృతికిని, మరణమునకును, ఊరుచుట్టుబైటికిని, నాలుగుతెరువులు చేరిన ప్రదేశమునకును పేరు.

వ్యసనం త్వశుభే భ్రంశే
విపత్తౌ నిష్ఫలోద్యమే. ౨౧౮. దైవానిష్టఫలే పాపే
దోషే కామజకోపజే,

వ్యసనమ్-॥న॥ ఇది అశుభమునకును, జాఱుటకును, విపత్తునకును, ఫలహీనమైన ప్రయత్నమునకును, దైవయోగముచే సంభవించు విపరీతమునకును, కామక్రోధాదులవల్లఁ బుట్టిన స్త్రీద్యూతాదిసప్తవ్యసనములకును పేరు.

స్యా ద్విధానం వేతనా
యా ముపాయే ప్రేరణే ధ
నే. ౨౧౯. ప్రకారే హస్తి
కబళే పూజాయాం వైర
కర్మణి,

విధానమ్-॥న॥ ఇది కూలికిని, ఉపాయమునకును, ప్రేరణమునకును, ధనమునకును, ప్రకారమునకును, ఏనుఁగుకబళమునకును పూజకును, విరోధకర్మకును పేరు.

వ్యఞ్జనం తేమనే చిహ్నే
శ్మశ్రు ణ్యవయవేఽక్షరే ౨౨౦

వ్యంజనమ్-॥న॥ ఇది మజ్జిగ, చారు, ఊరుబిండి మొదలైనదానికిని, చిహ్నమునకును, గడ్డము మీసములకును, స్త్రీపురుషుల గుహ్యావయవములకును, కకారాదిహకారాంతవర్ణములకును పేరు.

వేష్టనం ముకుటోష్ణీషే

వేష్టనమ్-॥న॥ ఇది తలపాగకు పేరు.

గన్ధనం తు ప్రకాశనే,
సూచనే చాపి హింసాయై
పరస్యోత్సాహనే చ తత్.

గంధనమ్-॥న॥ ఇది ప్రకాశమునకును, పరులహింసించుకొఱకు కొండెము చెప్పుటకును, ఉత్సాహమునకును, చకారమువలన నలుగుపెట్టుటకును పేరు.

సాధన మనుగతి గత్యో
శ్శేఫసి సిద్ధౌ నివృత్తి దాప
నయోః, మృతసంస్కారే
హేతౌ ధనహింసా యాత

సాధనమ్-॥న॥ ఇది వెంటఁబోవుటకును, గమనమునకును, శిశ్నమునకును, సిద్ధికిని, మగుడుటకును, అప్పువుచ్చుకొనినద్రవ్యము నిప్పించుటకును, మృతుని సంస్కరించుటకును, పక్షాంతరమున వసనాభిమొదలైనవానివిషమును బోఁగొట్టుటకును, కార

రాసు సేనాఙ్గే. ౧౬౨

లఙ్ఘనం తూపవాసేఽపి
సలిలేఽపిచ జీవనమ్,
జీవంత్యాం జీవనీ చా
థ క్రీడాయా మపి దేవ
నమ్. ౧౬౩. నాఽస్త్రే
థ దళనం క్లీబే కవచే ద
నే పుమాన్,
స్యన్దనం స్రవణే తోయే
నా తు నేమిద్రుమే రథే.
గోస్తనో హారభేదేఽపి మృ
ద్వీకాయాం తు గోస్తనీ,
వృజినం కిల్బిషే క్లీబే క్లేశే
నా కున్తలే త్రిషు. ౧౬౪
శయ్యాయాం శయనం న
స్త్రీ క్లీబే సురతనిద్రయోః,
శమనం శాన్తివధయోః
క్లీబే వైవస్వతే పుమాన్.
పాకస్థానే కులాలస్య
పవనం మారుతే పుమాన్
అపానో వాయుభేదే స్యా
దపానం గుదముష్కయోః.
నిశ్వాసే శ్వసనం నా తు
మారుతే మదనద్రుమే,
అస్త్రీ వితాన ముల్లోభ
విస్తార మఖ సద్మసు. ౧౬౫
తుచ్ఛే మన్దే త్రిష్వ
థాస్త్రీ వ్రీహ్యబ్దార్చిస్సు
హాయనః,
శకునం మఙ్గళాశంసనిమి
త్తే శకునః ఖగే. ౧౬౬

ణమునకును, ధనమునకును, చంపుటకును, అతిశయమైన వేదన
కును, సైన్యమునకును పేరు. [దాటుటకును పేరు.

లంఘనమ్ - ॥న॥ ఇది ఉపవాసమునకును, అపశబ్దమువలన
జీవనమ్-॥న॥ ఇది ఉదకమునకును, అపశబ్దమువలన బ్రతు
జీవనీ- ॥స్త్రీ॥ ఇది పాలకూరకు పేరు. [కుటకును పేరు.
దేవనమ్-ఇది క్రీడకును, అపశబ్దమువలన విలాసమునకును
పేరగునపుడు ॥న॥ జూదమునకుఁ బేరగునపుడు ॥పు॥

దళనమ్-ఇది కవచమునకు పేరగునపుడు ॥న॥ పగుల్చుటకు
పేరగునపుడు ॥పు॥

స్యందనమ్-ఇది స్రవించుటకును, ఉదకమునకును పేరయిన
పుడు ॥న॥ నెమ్మిచెట్టునకును, రథమునకును పేరయినపుడు ॥పు॥

గోస్తనః-ఇది నలువదిసరములుగలహారమునకు పేరయినపుడు
॥పు॥ ద్రాక్షకు పేరయినపుడు ॥స్త్రీ॥ గోస్తనీ.

వృజినమ్-ఇది పాపమునకు పేరైనపుడు ॥న॥ క్లేశమునకు
పేరైనపుడు ॥పు॥ వెండ్రుకలకు పేరయినపుడు ॥త్రి॥
శయనమ్-ఇది పాన్పునకు పేరైనపుడు ॥పు॥ సురతమునకును
నిద్రకును పేరయినపుడు ॥న॥

శమనమ్-ఇది శాంతికిని,వధకును పేరయినపుడు ॥న॥ యము
నికి పేరగునపుడు ॥పు॥

పవనమ్-ఇది కుమ్మరవాని వంటయింటికిఁ బేరయినపుడు ॥న॥
వాయువునకు పేరయినపుడు ॥పు॥

అపానః-ఇది వాయువిశేషమునకు పేరయినపుడు ॥పు॥ గుద
స్థానమునకును, వృషణమునకును పేరయినపుడు ॥న॥

శ్వసనమ్-ఇది ఊర్పునకు పేరయినపుడు ॥న॥ గాలికిని, మంగ
చెట్టునకును పేరగునపుడు ॥పు॥

వితానమ్-ఇది మేల్కట్టునకును, విస్తారమునకును, యజ్ఞము
నకును, గృహమునకును పేరయినపుడు ॥పు॥ తుచ్ఛమైనదాని
కిని, మందునికిని పేరయినపుడు ॥త్రి॥

హాయనః-॥పు॥ ఇది ధాన్యవిశేషమునకును, సంవత్సరమున
కును, కిరణమునకును పేరు.

శకునమ్-ఇది శుభమును దెలియఁజేయు నిమిత్తమునకు పేర
యినపుడు ॥న॥ కిక్షి పపేరగునపుడు ॥పు॥

సమానః ప్రాణభేదే నా
త్రిష్వేకసమసాధుషు,
మలినీ ఋతుమత్యాం స్త్రీ
కృష్ణదూషితయో స్త్రిష్షు.

స్పర్శే త్వగిన్ద్రియే దానే
స్పర్శనం మారుతే పుమాన్,
ధావనం ధావనే శుద్ధా
ధావనీ రజకస్త్రియామ్.
పద్మాకరే తు నళినో నళినీ
నళినం జలే, పద్మేఽ
థ కుహనా దమ్భచర్యా
యాం త్రిష్వసూయకే.
ప్రసన్నా మదిరాయాం
స్త్రీ ప్రసాదవతివాచ్యవత్,
స్యాన్మణ్డన మలఙ్కారే
ఽలఙ్కరిష్ణౌతు వాచ్యవత్.
నన్దనం వాసవోద్యానేసుతే
నాహర్షకే త్రిషు,

అఞ్జనా వాయుపత్నీ నా
దిగ్గజే కజ్జలేఽఞ్జనమ్. ౨౭౪
సజ్జనా కల్పనాయాం స్త్రీ
సజ్జనం తూపరక్షణే, త్రిషు
సాధౌ
చేతనా తు జ్ఞానే స్త్రీ
ప్రాణిని త్రిషు. ౨౭౫
విమానోఽస్త్రీ దేవయానే
సప్తభూమికసద్మని,
సుమనాః పుష్పమాలత్యోః
స్త్రీన్నియాం దేవే బుధే చ
నా. ౨౭౬

సమానః-ఇది ప్రాణభేదమునకు పేరగునపుడు ॥పు॥ ఒక్క-టైనదానికిని, సదృశమైనదానికిని, సజ్జనునికి పేరయినపుడు॥త్రి॥

మలినీ-ఇది ఋతుమతియైన స్త్రీకి పేరయినపుడు ॥స్త్రీ॥ నల్లనిదానికిని, దోషయుక్తమైనదానికిని పేరయినపుడు, మలినః, మలినం, మలినీ, అని ॥త్రి॥

స్పర్శనమ్-ఇది తాఁకుటకును, త్వగింద్రియమునకును, దానమునకును పేరగునపుడు ॥న॥ గాలికి పేరగునపుడు ॥పు॥

ధావనమ్-ఇది పరుగెత్తుటకును, శుద్ధికిని పేరయినపుడు ॥న॥ చాకలిదానికి పేరయినపుడు, ధావనీ ॥స్త్రీ॥

నలినః-ఇది కొలనికి పేరయినపుడు ॥పు॥ నళినీ అని స్త్రీలింగముగలదు. ఉదకమునకును, కమలమునకును పేరయినపుడు ॥న॥

కుహనా-ఇది దంభాచారములకు పేరయినపుడు ॥స్త్రీ॥ అసూయావంతునికి పేరయినపుడు ॥త్రి॥

ప్రసన్నా-ఇది మద్యమునకు పేరయినపుడు ॥స్త్రీ॥ స్వచ్ఛమైనదానికి పేరయినపుడు విశేష్యలింగము.

మణ్డనమ్-ఇది అలంకారమునకుఁ బేరైనపుడు॥న॥అలంకరించు స్వభావముకలదానికి పేరయినపుడు విశేష్యలింగము.

నన్దనమ్-ఇది ఇంద్రునియుద్యానమునకుఁ బేరయినపుడు ॥న॥ పుత్రునికి పేరయినపుడు ॥పు॥ ఆనందకరమయినదానికి పేరయినపుడు ॥త్రి॥

అంజనా-ఇది వాయుదేవునిభార్యకు పేరయినపుడు ॥స్త్రీ॥ దిగ్గజమునకుఁ బేరయినపుడు ॥పు॥ కాటుకకు పేరగునపుడు ॥న॥

సజ్జనా-ఇది ఏనుఁగును శృంగారించుటకు పేరగునపుడు ॥స్త్రీ॥ దండుకావలికొఱకు చుట్టునుంచినవెలుఁగు మొదలైనదానికి పేరగునపుడు ॥న॥ సాధువయినదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

చేతనా-ఇది జ్ఞానమునకు పేరగునపుడు ॥స్త్రీ॥ ప్రాణవంతునకు పేరగునపుడు॥త్రి॥

విమానః-॥పు॥ ఇది దేవయానమునకును, ఏడుప్పరిగలుగల గృహమునకును పేరు.

సుమనాః-॥న్_స్త్రీ॥ ఇది పుష్పమునకును, జాజితీఁగెకును పేరు. దేవతలకును, పండితునకును పేరయినపుడు ॥పు॥

అయం పుష్పే బహుష్వేవ

అయం=ఈసుమనశ్శబ్దము, పుష్పే=పుష్పవాచకమైనపుడు, బహుష్వేవ=బహువచనమునందె వర్తించును.

లోధ్రవృక్షేఽపి మార్జనః,

మార్జన - ఇది లొద్దుగచెట్టునకు పేరైనపుడు ॥పు॥ అపి శబ్దమువలన చందనకుంకుమాదులచేత దేహమునందు మురికిఁ పోఁగొట్టుటకుఁ బేరైనపుడు ॥స్త్రీ॥

స్యా దుత్తాన మగమ్భీరే
శయితోర్ధ్వముఖేఽపిచ.

ఉత్తానం - ॥న॥ ఇది మిట్టయయినదానికిని, వెల్లికలపండుకొనినదానికిని పేరు.

రసనం స్నేహకషాయద్రవ
విషహేమాన్నరూప్య రా
స్నాసు, ధ్వనిలవనిర్యాసే
ష్వథ కాఞ్చ్యాం స్త్రీ స్వాదు
జిహ్వయో రసనా. ౨౬౮

రసనం - ॥న॥ ఇది చమురునకును, లవణరసమునకును, ద్రవమునకును, విషమునకును, బంగారమునకును, అన్నమునకును, వెండికిని, సన్నరాస్నకును, ధ్వనికిని, లేశమునకును, బంకకును పేరైనపుడు ॥న॥ మొలనూలికిని, రుచికిని, నాలుకకును పేరయినపుడు ॥స్త్రీ॥

పార్థేఽర్జునః కేకిని కార్త
వీర్యే నేత్రామయేఽప్యేక
సుతే చ మాతుః, వర్ణే ద్రు
మేచాథ సితే త్రి లిఙ్గోగవ్య
ర్జునీ హేమ్ని తృణే ఽర్జు
నం స్యాత్. ౨౬౯

అర్జునః - ఇది కుంతీపుత్రునకును, నెమలికిని, కార్తవీర్యునకును, కంటిరోగమునకును, తల్లికి నొక కుమారుఁడైనవానికిని, వర్ణమునకును, మద్దిచెట్టునకును బేరగునపుడు ॥పు॥ తెల్లని కాంతికిఁ బేరగునపుడు ॥త్రి॥ శ్రేష్ఠమైనగోవునకుఁ బేరగునపుడు అర్జునీ - అని స్త్రీలింగము. బంగారమునకును, తృణమునకును బేరగునపుడు ॥న॥

వేదనా స్త్రీ దుఃఖభోగే
జ్ఞానే క్లీబ

వేదనా - ఇది దుఃఖానుభవమునకుఁ బేరగునపుడు ॥స్త్రీ॥ జ్ఞానమునకుఁ బేరగునపు ॥న॥

మథ త్రిషు, తలినం విరళే
చాల్పే

తలినం - ॥త్రి॥ ఇది విరళమైనదానికిని, అల్పమైనదానికిని నామము. [నామము.

విలీనో లీన విద్రుతౌ.

విలీనః - ॥పు॥ ఇది దాఁగినవానికిని, కరఁగినఘృతాదులకును

వామనో వాచ్యవ త్ఖర్వే
విష్ణు దిగ్గజయోః పుమాన్,

వామనః - ఇది పొట్టివానికిఁ బేరగునపుడు విశేష్యలింగము. విష్ణువునకును, దిగ్గజమునకును బేరగునపుడు ॥పు॥

అవలగ్నే విలగ్నోఽస్త్రీ
సంలగ్నే త్రి ష్వ

విలగ్నః - ఇది నడుమునకుఁ బేరగునపుడు ॥ప్న॥ కూడినదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

థ ద్వయోః. ౨౭౦ అశ
ని ర్విద్యుతి పవౌ

అశనిః-॥ప్స॥ ఇది మెఱుపునకును, వజ్రాయుధమునకును బేరు.

రోచనః కూటశాల్మలౌ,
రోచనా రక్తకల్హారే గవాం

రోచనః - ఇది కొండబూరుగచెట్టునకుఁ బేరగునపుడు ॥పు॥ ఎఱ్ఱకలువకును, గోరోచనమునకును, శ్రేష్ఠమైన స్త్రీకిని

న్నా క్లిన్నజీర్ణార్ద్రా)
శో ఖల సూచకౌ,
న్న ఆపత్ప్రాప్తేఽపి
న్న స్సాధితేఽపి చ
౨౮౩
ఇతి నాంతాః.

---

పో భూషణే బర్హే
వ్యం సంహత తూణ
ః కల్పనే వేషే
పి భ్రాన్తి కల్ప
౨౮౪
శ్శత్రు చింతాయాం
వాలయో రపి,
పో భర్త్సనా కృ
వ్యాలఙ్కార చో
ః. ౨౮౫
త్పాదపః పాదపీఠే
నే మహీరుహే,
మునిమీనా ద్వా
పో పౌరుషాతపౌ
త్ జ్ఞాన తిథ్యో
ఘులి వీణయోః,
స్త్రీ ద్రువిస్తారే
మ్బ శాఖయోః
విటే తు నా స్యా

విక్లిన్నః - ॥పు॥ ఇది వెదచల్లఁబడినదానికిని, జీర్ణమైనదానికిని, తడిసినదానికిని నామము.

పిశునః - ॥పు॥ ఇది దుర్జనునికిని, కొండెగానికిని నామము.

ఆపన్నః - ॥పు॥ ఇది ఆపదనొందినవానికిని, అపశబ్దమువలన శత్రువులచేతఁ బట్టుపడినవానికిని పేరు.

సంపన్నః - ॥పు॥ ఇది రాజుచేత దండుగ గొనఁబడినవానికిని అపశబ్దమువలన సంపదపొందినవానికిని పేరు.

నాంతపదవర్గము ముగిసెను.

---

కలాపః - ॥పు॥ ఇది భూషణమునకును, నెమలిపింఛమునకును, మొలనూలికిని, కూటమికిని, అమ్ములపొదికిని నామము.

ఆకల్పః - ॥పు॥ ఇది కల్పమునకు, అలంకరించుటకును పేరు.

వికల్పః - ॥పు॥ ఇది బుద్ధిభ్రమకును, బ్రహ్మకల్పమునకును పేరు.

ఆవాపః - ॥పు॥ ఇది శత్రువిషయచింతకును, దున్నుటకును, పాదికిని నామము.

ఆక్షేపః-॥పు॥ ఇది బెదరించుటకును, దున్నుటకును, కావ్యాలంకారభేదమునకును, ప్రశ్నకును నామము.

పాదపః - ॥పు॥ ఇది పాదపీఠమునకును, కాలితోనడుచు వాహనమునకును, వృక్షమునకును నామము.

కశ్యపః - ॥పు॥ ఇది మునికిని, మత్స్యమునకును నామము.

ప్రతాపః-॥పు॥ఇది పౌరుషమునకును, ఎండకును నామము.

ప్రతిపత్ -॥స్త్రీ॥ ఇది జ్ఞానమునకును, పాడ్యమికిని నామము.

కచ్ఛపీ - ॥స్త్రీ॥ ఇది ఆఁడుతాఁబేటికిని, సరస్వతియొక్క వీణెకును నామము.

విటపః - ఇది మ్రానియొక్క చిగురుకొమ్మలు మొదలైన వాని సమూహమునకును, చిగురునకును, వ్రేళ్లకొమ్మలకు నడిమి భాగము లేక యాఁకులు దట్టమయి యున్నదానికిని, కొమ్మకును పేరగునపుడు ॥న॥ విటునకుఁ బేరగునపుడు ॥పు॥

దుడుప స్త్వీన్దౌ నా న ద్వయోః ప్లవే,
అస్త్రీ కశిపుశ్శయ్యాయాం వస్త్రేఽన్నే తద్ద్వయేఽపి చ.
కుతపోఽర్కే౽గవి విప్రే వహ్నా వతిథౌ చ భాగినేయే చ, అస్త్రీ దినాష్టమాంశే కుశతిలయో శ్ఛాగకమ్బళే ఫాలే. ౨౮౯

ఇతి పాన్తాః.

---

[త్ర్యక్షరఫాన్తా న సన్తి]

హేరమ్బౌ మహిషేభాస్యౌ ప్రలమ్బౌ హార దానవౌ,
కాదమ్బౌ కలహంసేషూ కదమ్బౌ నీప సంహతీ.
కలమ్బౌ నీప శిఖినౌ శాక భేదే కలమ్బ్యపి.
నితమ్బః స్త్రీకటేః పశ్చాద్భాగేఽద్రికటకే కటౌ.
బడబాఽశ్వా కుమ్భదాస్యో ర్యోషిద్భేదే ద్విజస్త్రియామ్,
బాడబా బ్రాహ్మణౌర్వాగ్నీ బాడబం బడబాగణే.

ఇతి బాన్తాః.

---

ఋషభోఽద్రౌ కర్ణరన్ధ్రే వృషే మత్తగజే స్వరే, వనసూకరపుచ్ఛేఽ

ఉడుపః — ఇది చంద్రునకుఁ బేరగునపుడు ॥పు॥ తెప్పకుఁ బేరగునపుడు ॥న॥

కశిపుః — ॥ప్న॥ ఇది పాన్పునకును, వస్త్రమునకును, అన్నమునకును, ఏకోక్తిగా వస్త్రాన్నములకు రెంటికిని నామము.

కుతపః — ఇది సూర్యునికిని, గోవునకును, బ్రాహ్మణునికిని, అగ్నికిని, అతిథికిని, చెల్లెలికొడుకునకును బేరగునపుడు ॥పు॥ దినము యొక్క యెనిమిదవభాగమునకును, దర్భకును, తిలలకును, మేఁకవెండ్రుకల కంబళికిని, నొసటికిని బేరగునపుడు ॥ప్న॥

పాంతపదవర్గము ముగిసెను.

---

[మూఁడక్షరముల ఫాంతములు లేవు.]

హేరంబః-॥పు॥ ఇది మహిషమునకును, వినాయకునికిని పేరు.

ప్రలంబః — ॥పు॥ ఇది హారభేదమునకును, ప్రలంబుఁడను రాక్షసునికిని నామము.

కాదంబః-॥పు॥ఇది కలహంసకును, బాణమునకును నామము.

కదంబః-॥పు॥ ఇది కడిమిచెట్టునకును, సమూహమునకుం బేరు.

కలంబః — ॥పు॥ ఇది కడిమిచెట్టునకును, అగ్నికిని నామము. తీఁగె బచ్చలికి నామమయ్యెనేని కలంబీ ॥స్త్రీ॥

నితంబః — ॥పు॥ ఇది స్త్రీలయొక్క పిఱుఁదుల వెనుకనుండు భాగమునకును, కొండనడిమికిని, పిఱుఁదులకును నామము.

బడబా — ॥స్త్రీ॥ ఆఁడుగుఱ్ఱమునకును, నీళ్లకడవలు మోయు బానిసెకును, స్త్రీభేదమునకును, బ్రాహ్మణస్త్రీకిని నామము.

బాడబః — ఇది బ్రాహ్మణునికిని, బడబాగ్నికిని, నామమయ్యెనేని ॥పు॥ ఆఁడుగుఱ్ఱముల గుంపునకును, నామమయ్యెనేని ॥న॥

బాంతపదవర్గము ముగిసెను.

---

ఋషభః — ॥పు॥ ఇది పర్వతవిశేషమునకును, కర్ణరంధ్రమునకును, ఎద్దునకును, మదపుటేనుఁగునకును, స్వరభేదమునకును, అడవిపందితోఁకకును, అపిశబ్దమువలన ఋషభమను నౌషధమున

థ వృషభః పుఙ్గవే వృషే.

వృషభః-॥పు॥ ఇది పురుషశ్రేష్ఠునకును, ఎద్దునకును నామ...

విస్రమ్భః కేళికలహే
స్నేహవిశ్వాసయో రపి,

విస్రంభః - ॥పు॥ ఇది క్రీడాకలహమునకును, స్నేహమ...కును, నమ్మికకును, అపశబ్దమువలనఁ బరిచయమునకును, హిం...చుటకును నామము.

స్యా ద్విష్కమ్భో నాట
కాఙ్గే విసార ప్రతిబన్ధయోః,
౨౯౪. యోగభేదే

విష్కంభః-॥పు॥ఇది నాటకాంగమునకును, సామాన్యమత్...మునకును, ప్రతిబంధకమునకును, యోగభేదమునకును నామ...

ఽథ శరభోఽష్టాపదే చ
మృగాన్తరే.

శరభః - ॥పు॥ ఇది జూదమాడు పలకకును, ఎనిమిదికా...గలదై సింహమునుజంపెడి మృగమునకును నామము.

ఆత్మభూ ర్మన్మథే వేధ

ఆత్మభూః - ॥పు॥ ఇది మన్మథునికిని, బ్రహ్మకును నామ...

స్యారమ్భో వధ దర్ప
యోః. ౨౯౫. ఉద్యమే

ఆరంభః -॥పు॥ ఇది వధకును, అహంకారమునకును, ఉద...గమునకును నామము.

చాథ కకుభో వీణాఙ్గేఽ
ర్జునపాదపే,

కకుభః-॥పు॥ ఇది వీణాంగమైన కరివెకును, మద్దిచెట్టునకు నామము.

సనాభి స్సదృశజ్ఞాత్యో

సనాభిః - ॥పు॥ ఇది సమానమునకును, జ్ఞాతికిని నామము

రాలమ్భ స్స్పర్శహింస
యోః. ౨౯౬

ఆలంభః-॥పు॥ నలుగు పెట్టుటకును, హింసకును నామము.

కుసుమ్భం కుసుమే క్లీబం
స్యాన్మహారజనేఽపి తత్,
కమణ్డలౌ పుమా నేష

కుసుంభమ్ - ఇది సామాన్యముగా పుష్పమునకును, కుసు...పువ్వునకును, నామమయ్యెనేని ॥న॥ కమండలమునకు నా...మయ్యెనేని ॥పు॥

సురభిస్తు గవి స్త్రియామ్.
౨౯౭. వసన్త చైత్రయోః
పుంసి త్రిషు సౌమ్య సుగ
న్ధినోః,

సురభిః - గోవునకు నామమయ్యెనేని ॥స్త్రీ॥ వసంతఋతు...వునకును, చైత్రమాసమునకును నామమయ్యెనేని ॥పు॥ సౌమ...మైనదానికిని, సుగంధయుక్తమైనదానికిని నామమయ్యెనే... ॥త్రి॥

స్త్రియాం పునర్నవా భే
క్యో ర్వర్షాభూ ర్దర్దురే తు
నా. ౨౯౮

వర్షాభూః - ఇది గలిజేరుచెట్టునకును, ఆఁడుకప్పకును, నామ...మయ్యెనేని ॥స్త్రీ॥ కప్పకు నామమయ్యెనేని ॥పు॥

పుమాన్ భేర్యాం దున్దుభి
స్త్రీ (స్త్రీ) త్వక్షబిన్దుత్రికే ద్వయే

దుందుభిః-ఇది భేరికి నామమయ్యెనేని ॥పు॥ పాచికలయం...దుండు నిత్తిగకును నామమయ్యెనేని ॥స్త్రీ॥

వల్లభో నా కులీ నాశ్వే
దయితా ధ్యక్షయో స్త్రిషు.

వల్లభః - ఇది శ్రేష్ఠమైన గుఱ్ఱమునకు నామమయ్యెనే... ॥పు॥ ఇష్టునికిని, అధ్యక్షునికిని నామమయ్యెనేని ॥త్రి॥

ఇతి భాన్తాః.

భాంతపదవర్గము ముగిసెను.

నిగమో నిశ్చయే పుర్యాం
పథి వేదే వణిక్పథే,

నిగమః-॥పు॥ ఇది నిశ్చయమునకును, పట్టణమునకును, మార్గమునకును, వేదమునకును, అంగడివీథికిని నామము.

నైగమ స్తూపనిషది దస్తే
వణిజి నాగరే. 300

నైగమః-॥పు॥ ఇది ఉపనిషత్తునకును, ఏనుఁగుదంతమునకును, వర్తకునికిని, పట్టణమునఁ బుట్టినవానికిని నామము.

విక్రమః క్రమణే కార్శ్యే

విక్రమః-॥పు॥ఇది ఆక్రమించుటకును, కార్శ్యమునకును పేరు.

ప్రక్రమోఽవసరే క్రమే,

ప్రక్రమః-॥పు॥ ఇది ప్రస్తావమునకును, నడుపునకును పేరు.

సఙ్క్రమో దారియన్త్రే
ఽపి

సంక్రమః - ॥పు॥ ఇది జలయంత్రమునకును, అపిశబ్దమువలన సూర్యుఁడు మేషాదిరాసులం గూడుటకును నామము.

ధీసామర్థ్యేఽపినిష్క్రమః.
30౧

నిష్క్రమః - ॥పు॥ ఇది బుద్ధిసామర్థ్యమునకును, అపిశబ్దమువలన లోపలనుండి బైటవచ్చుటకును నామము.

విభ్రమ స్సంశయే భ్రాన్తౌ
స్యా ద్భావాన్తరశోకయోః,

విభ్రమః - ॥పు॥ ఇది సంశయమునకును, భ్రాంతికిని, స్త్రీల శృంగారభావమువల్లఁ బుట్టినక్రియకును,శోకమునకును నామము.

సమ్భ్రమోఽత్యాదరే
భీతా వావేగే

సంభ్రమః - ॥పు॥ ఇది మిక్కిలి యాదరణకును, భయమునకును, తొట్రుపాటునకును నామము.

నియమ స్త్వ్వహ. 30౨
ప్రతిజ్ఞాజ్ఞాయన్త్రణా సుయో
గాఙ్గే నిశ్చయే వ్రతే,

నియమః - ॥పు॥ ఇది ప్రతిజ్ఞకును, ఆజ్ఞకును, కట్టుటకును, యోగసాధనమునకును, నిశ్చయమునకును, వ్రతమునకును పేరు

కలమ శ్శాలిలేఖిన్యో శ్చౌ
రే లాక్షారసేఽఙ్కురే.

కలమః - ॥పు॥ ఇది పైరునకును, పత్రికకును, దొంగకును, లాక్షారసమునకును, మొలకకును నామము.

ఆగమ స్త్వాగతౌ శాస్త్రే

ఆగమః - ॥పు॥ ఇది వచ్చుటకును, శాస్త్రమునకును పేరు.

విద్రుమో ద్రుప్రవాళయోః.

విద్రుమః-॥పు॥ ఇది వృక్షమునకును, పవడమునకును పేరు.

త్రిధామా కేశవే వహ్నౌ

త్రిధామా - ॥న్-పు॥ ఇది విష్ణువునకును, అగ్నికిని పేరు.

హారిమా మృత్యుయోగ
యోః. 30౪

హారిమా - ॥న్-పు॥ ఇది మృత్యువునకును, యోగమునకును పేరు.

గరుత్మా న్విహగే తార్క్ష్యే
ద్విజన్మా బ్రాహ్మణే ఖగే,

గరుత్మాన్-॥త్-పు॥ ఇది పక్షిసామాన్యమునకును, గరుత్మంతునికిని పేరు.

ద్విజన్మా-॥న్-పు॥ ఇది బ్రాహ్మణునికిని, పక్షికిని పేరు.

వ్యాయామః పౌరుష
వ్యామ స్సఞ్చారో దుర్గ
సంహతిః. 30౫

వ్యాయామః - ॥పు॥ ఇది పురుషునిబారకును, సంచారమునకును, దుర్గసమూహమునకును పేరు.

గోలోమీ స్త్రీ వారనా
ర్యాం షడ్గ్రన్థా శ్వేత

గోలోమీ-॥సీ॥ ఇది వేశ్యకును,వసకును, తెల్లగఱికకును పేరు

దూర్వయోః,

కుసుమం పుష్పఫలయో స్త్రీరజో నేత్రరోగయోః.

కుసుమమ్ - ॥న॥ ఇది పుష్పమునకును, ఫలమునకును, స్త్రీయొక్క ఋతువునకును, కంటివ్యాధికిని పేరు.

తలిమం కుట్టిమే తల్పే చ న్ద్రిహాసే

తలిమమ్ - ॥న॥ ఇది మేడలయొక్క యడుగుభూమికిని పాన్పునకును, పెద్దకత్తికిని పేరు.

థ గౌతమః, మునిభేదే శాక్యసింహే గోదావర్యాంతు గౌతమీ. ౩౦౭

గౌతమః - ॥పు॥ ఇది గౌతమమునికిని, బుద్ధదేవునికిని పేరు గోదావరికి పేరగునపుడు, గౌతమీ ॥స్త్రీ॥

పరమం స్యా దనుజ్ఞానేఽవ్యయం నా పరమాత్మని, త్రిషూత్కృష్టే

పరమమ్ - ఇది అంగీకారమునకు పేరగునపుడు ॥న॥ పరమాత్మకు పేరగునపుడు ॥పు॥ శ్రేష్ఠునికి పేరగునపుడు ॥త్రి॥

పఞ్చమస్తు స్వరే నా పూరణే త్రిషు. ౩౦౮

పంచమః-ఇది స్వరవిశేషమునకును పేరగునపుడు ॥పు॥ పంచసంఖ్యాపూరకమైనదానికి పేరగునపుడు ॥త్రి॥

మునిస్థానే మఠే బ్రహ్మచర్యాదావాశ్రమోఽస్త్రియాం,

ఆశ్రమః-॥పు॥ ఇది మునులున్న స్థానమునకును, విద్యార్థులు మొదలైనవారికి స్థానమైన మఠమునకును, బ్రహ్మచర్యాద్యాశ్రమములకును పేరు.

సుషమోత్కృష్టశోభాయాం త్రిషు చారౌ సమేఽప్యథ. ౩౦౯

సుషమా-ఇది శ్రేష్ఠమైనకాంతికి పేరగునపుడు ॥స్త్రీ॥ సుందరమైనదానికిని, సమమైనదానికిని పేరైనపుడు ॥త్రి॥

అశ్వభూషా పుణ్డ్రపుచ్ఛశ్రేష్ఠ శృంగారకేతునా, లిఙ్గే ప్రభావే పురుషేలలామోఽస్త్రీ లలామ చ. ౩౧౦

లలామః - లలామ-॥న॥-॥పు॥ ఇది గుఱ్ఱమునకును, ఆభరణమునకును, తిలకమునకును, తోకకును, శ్రేష్ఠమైనదానికిని, శృంగారమునకును, టెక్కెమునకును, గుఱుతునకును, ప్రభావమునకును, పురుషునికిని పేరు.

సర్వేనా మధ్యమో దేహమధ్యే మధ్యే నపుంసకమ్, మధ్యస్థే వాచ్యవత్ స్త్రీతు హస్తమధ్యాఙ్గుళావపి. ౩౧౧ ఛన్దోభేదే దృష్టరజః కన్యామా మధ్య

మధ్యమః - ఇది స్వరవిశేషమునకును, దేహమధ్యమునకును పేరైనపుడు ॥పు॥ మధ్యమునకు పేరైనపుడు ॥న॥ మధ్యస్థునకు పేరైనపుడు విశేష్యలింగము. చేతినడిమివ్రేలికిని, ఛందోభేదమునకును, క్రొత్తగా సమర్తాడినపడుచునకును పేరయినపుడు ॥స్త్రీ॥

థ త్రిషు, సత్తమా శ్రేష్ఠపూజ్యౌ ద్వౌ

సత్తమః-॥త్రి॥ ఇది శ్రేష్ఠునికిని, పూజ్యునికిని పేరు.

ప్రథమా ప్రవరా దిమా.

ప్రథమః - ॥పు॥ ఇది శ్రేష్ఠునికిని, మొదటివానికిని పేరు.

అధమౌ గర్హితన్యూనౌ

వుత్తమౌ ప్రవరాన్తిమౌ,
ఇతి మాంతాః.

---

ప్రణయస్స్యాత్పరిచయే
విస్రమ్భే ప్రేమ యాచ్ఞ
యోః. ౩౧౩

వినయో నతిశిక్షాది ధర్మా
చార ప్రశాన్తిషు,
అనయ స్త్వశుభే దైవే
విపత్తౌ వ్యసనేఽప్య
థ. ౩౧౪. పశ్చాదవస్థాయి
బలే సమవాయేచ సన్నయః,

విషయో గోచరే దేశే
జ్ఞాతో యోయస్య తత్ర చ.
౩౧౫

ప్రళయో మరణే పాపే
మూర్ఛా కల్పావసానయోః,
ప్రత్యయోఽధీన విశ్వాస
ధీ రన్ధ్రాచార హేతుషు.
ఖ్యాతౌ సనాదౌ శపథే
చిత్రగర్వే తు విస్మయౌ,
వ్యవాయోఽన్త ర్ధిరతయో
రుపాయ స్స్యా దుపా
గతౌ. ౩౧౬. సామాదా
వథ సంస్థాయ స్సన్ని
వేశే గృహే గణే,
ఉదయః పూర్వశైలే స్యా
దున్నతే వృద్ధగతా వసి.
[illegible]

అధమః - ॥పు॥ ఇది నిందింపఁబడినవానికిని, తక్కువైనవానికిని పేరు.

ఉత్తమః - ॥పు॥ ఇది శ్రేష్ఠునికిని, తుదనున్న దానికిని పేరు.

మాంతపదవర్గము ముగిసెను.

---

ప్రణయః - ॥పు॥ ఇది పరిచయమునకును, నమ్మకమునకును ప్రేమకును, యాచనకును పేరు.

వినయః - ॥పు॥ ఇది నమస్కారమునకును, శిక్షమొదలైన వానికిని, ధర్మమునకును, ఆచారమునకును, ఉపశాంతికిని పేరు

అనయః - ॥పు॥ ఇది పూర్వజన్మకృతమయిన యశుభకర్మకును, ఆపదకును, జూదము మొదలయిన సప్తవ్యసనములకును పేరు

సన్నయః - ॥పు॥ ఇది సేన వెనుకనుండు దుముదారి ప్రోఁజుకును, సమూహమునకును, చకారమువలన సంబంధమునకును పేరు

విషయః - ॥పు॥ ఇది శబ్దస్పర్శరూపరసగంధములకును, దేశమునకును, ఎవరిచేత నేది నిత్యమును పరిచయము చేయబడునో దానికిని పేరు.

ప్రళయః - ॥పు॥ ఇది మరణమునకును, పాపమునకును, మూర్ఛకును, కల్పాంతమునకును పేరు.

ప్రత్యయః - ॥పు॥ ఇది అధీనమునకును, విశ్వాసమునకును బుద్ధికిని, రంధ్రమునకును, ఆచారమునకును, హేతువునకును ప్రసిద్ధికిని, సనాదిప్రత్యయములకును, శపథమునకును పేరు.

విస్మయః - ॥పు॥ ఇది ఆశ్చర్యమునకును, గర్వమునకును పేరు

వ్యవాయః - ॥పు॥ ఇది దాఁగుటకును, రతిక్రీడకును పేరు

ఉపాయః - ॥పు॥ ఇది వచ్చుటకును, సామాద్యుపాయములకును పేరు.

సంస్థాయః - ॥పు॥ ఇది పట్టణము చుట్టు బయలునకును, గృహమునకును, సమూహమునకును పేరు.

ఉదయః - ॥పు॥ ఇది ఉదయపర్వతమునకును, ఉన్నతమునకును, ఊర్ధ్వగతికిని పేరు.

[illegible] - ॥పు॥ ఇది మరణమునకును, దోషమునకును, దు

చ్ఛేఽతిక్రమదణ్డయోః,
నికాయో నిలయే లక్ష్యే
సముదాయే సధర్మిణామ్.
౩౧౯. అసంహతా నా మే
కత్ర కరణే పరమాత్మని
ఆశయః స్థానతాత్పర్యే
కులాయ స్థానసీడయోః
పర్యాయః క్రమ నిర్యా
ణ ప్రకారావసరే ష్వపి, ఏ
కార్థవాచిశబ్దేచ
పౌలస్త్యో శ్రీద రావణౌ.
పర్జన్యో మేఘ నిర్ఘోషే
వాసవే గర్జదమ్బుదే,
శాణ్డిల్యో మునిమాలూరా
శ్వశుర్యా స్యాలదేవరౌ.
౩౨౨
ఆదిత్యో రవి గీర్వాణౌ
రోహిత్యో వ్రీహిసాగరౌ,
స్యా దామ్నాయ స్సం
ప్రదాయే కులేఽధ్యయన
వేదయోః. ౩౨౩
ఊర్ణాయు రూర్ణాభేదేఽపి
మేషే తల్లోమకమ్బళే,
చరయు ర్వారిదే వాతే
భ్రాతృవ్యో భ్రాతృజే
రిపౌ. ౩౨౪
సమయః కాల సిద్ధాన్త
ప్రతిజ్ఞా శపథేషుచ, సఙ్కే
తాచారయోశ్చ
థ స్వాధ్యాయో జప వే
దయోః. ౩౨౫
విశల్యా ఫలినీ దన్తీ గు

మునకును, అతిక్రమించుటకును, దండమునకును పేరు.

నికాయః - ॥పు॥ ఇది ఇంటికిని, గుఱికిని, ఒకనడత
గుంపునకును, ఒకచోటఁ జేరనివానిని నొకచోటఁ జేర్చు
పరమాత్మకును పేరు.

ఆశయః-॥పు॥ ఇది స్థానమునకును, తాత్పర్యమునకును

కులాయః - ॥పు॥ ఇది ఉనికికిని, గూటికిని పేరు.

పర్యాయః - ॥పు॥ఇది వరుసకును, మోక్షమునకును,
అవసరమునకును, సమానార్థకశబ్దమునకును పేరు.

పౌలస్త్యః - ॥పు॥ ఇది కుబేరునికిని, రావణునికిని పే

పర్జన్యః - ॥పు॥ ఇది మేఘధ్వనికిని, ఇంద్రునికిని, గ
మేఘమునకును పేరు. [కును

శాండిల్యః - ॥పు॥ ఇది శాండిల్యమునికిని, మారేడు

శ్వశుర్యః-॥పు॥ ఇది ఆలితోడఁబుట్టినవానికిని, మగనితో
బుట్టినవానికిని పేరు.

ఆదిత్యః - ॥పు॥ ఇది సూర్యునికిని, దేవతలకును పేరు.

రోహిత్యః-॥పు॥ఇది ధాన్యమునకును, సముద్రమునకును

ఆమ్నాయః-॥పు॥ ఇది సంప్రదాయమునకును, కులమును
చదువునకును, వేదమునకును పేరు.

ఊర్ణాయుః - ॥పు॥ ఇది తంతుభేదమునకును, గొఱ్ఱె
అగొఱ్ఱెరోమములకంబళికిని పేరు.

చరయుః-॥పు॥ ఇది మేఘమునకును, వాయువునకును పే

భ్రాతృవ్యః - ॥పు॥ ఇది తోడఁబుట్టినవాని కొడుకునక
శత్రువునకును పేరు.

సమయః - ॥పు॥ ఇది కాలమునకును, సిద్ధాంతమునకును,
జ్ఞకును, ఆన పెట్టుటకును, సంకేతమునకును, ఆచారమున
పేరు.

స్వాధ్యాయః-॥పు॥ ఇది జపమునకును, వేదమునకును పే

విశల్యా - ॥స్త్రీ॥ ఇది వెన్న వెదురుకూరకును, దంతిచెట్టు

దూచీ లాఙ్గలీషు చ,

కును, తిప్పతీఁగెకును, నీరుపిప్పలికిని, చకారమువలన పొావర చెట్టునకును పేరు.

అభిఖ్యా త్విడ్యశో నామ స్వోం

అభిఖ్యా - ॥సీ॥ ఇది కాంతికిని, కీర్తికిని, నామధేయమునకును పేరు.

ద్రియం త్వక్షి రేతసోః.

ఇంద్రియమ్-॥న॥ఇది నేత్రమునకును, రేతస్సునకును పేరు.

సామర్థ్యం యోగ్యతాశ శక్త్యో

సామర్థ్యమ్-॥న॥ఇది యోగ్యతకును, శక్తికిని పేరు.

ర్హృదయంచిత్తవక్షసోః,

హృదయమ్-॥న॥ ఇది చిత్తమునకును, రొమ్మునకును పేరు.

చారుత్వ మపి సౌరభ్యం

సౌరభ్యమ్-॥న॥ ఇది ఒప్పిదమునకును, అపిశబ్దమువలన పరిమళమునకును పేరు.

నేపథ్యం రఙ్గభూ రపి. ౩౨౭

నేపథ్యమ్-॥న॥ ఇది నాట్యస్థానమునకును, అపిశబ్దమువలన నలంకరించుటకును పేరు.

పుత్ర్యాం పుత్రే ఽపి చాపత్య

అపత్యమ్-॥న॥ ఇది కొమార్తెకును, కొమారునికిని పేరు.

మౌచిత్యం సత్యయోగ్యయోః,

ఔచిత్యమ్-॥న॥ ఇది సత్యమునకును, యోగ్యమునకును పేరు.

స్యా ద్బ్రాహ్మణ్యం బ్రాహ్మణానాం భావసంహతి కర్మసు. ౩౨౮

బ్రాహ్మణ్యమ్-॥న॥ ఇది బ్రాహ్మణులయొక్క భావమునకును, వారిసమూహమునకును, వారికర్మకును పేరు.

స్యా ద్ధిరణ్యం హేమ్ని కుప్యే విత్త మాన విశేష యోః, వరాటరేతసో శ్చా

హిరణ్యమ్-॥న॥ ఇది బంగారమునకును, వెండి బంగారముల కంటె నితరమైనలోహజాతికిని, ధనమునకును, కొలత భేదమునకును, గవ్వకును, రేతస్సునకును పేరు.

థ మలయః పర్వతాన్తరే.

౩౨౯. పర్వతాంశే ఽప్యథోద్యానే మలయం మలయా త్రివృత్,

మలయః-ఇది పర్వతవిశేషమునకును, పర్వతమునందొకభాగమునకు పేరైనపుడు ॥పు॥ ఉద్యానమునకు పేరైనపుడు ॥న॥ తెల్లతెగడకుఁ బేరైనపుడు ॥సీ॥

సైన్ధవే తాలపర్ణ్యాం చ శైలేయం భ్రమరే పుమాన్ ౩౩౦

శైలేయమ్-ఇది లవణభేదమునకును మురయను గ్రంథ్యద్రవ్యమునకును పేరగునపుడు ॥న॥ తుమ్మెదకు పేరయినపుడు ॥పు॥

విజయా పార్వతీ తిథ్యో ర్విజయో జయపార్థయోః,

విజయా-ఇది పార్వతికిని, తిథిభేదమునకును పేరయినపుడు ॥సీ॥ జయమునకును, అర్జునునకును పేరయినపుడు ॥పు॥

అభయం నలదే స్త్రీ తు న

[illegible]

ధ్యాయాం నిర్భయే త్రిషు.

జేరైనపుడు ॥స్త్రీ॥ భయములేనిదానికి పేరగునపుడు ॥త్రి॥

కశేరు హేమ్నో ర్గాఙ్గేయం గాఙ్గేయో, గుహభీష్మయోః,

గాంగేయమ్-ఇది తామరకలువ మొదలైనవానిదుంపలకును, బంగారమునకును పేరైనపుడు ॥న॥ కుమారస్వామికిని, భీష్మాచార్యులకును పేరైనపుడు ॥పు॥

అస్త్రీ కషాయో నిర్యాసే సౌరభే రసనాగయోః 33౨. క్వాథే విలేపనేచాపి ద్రవ్యే స్యా ద్దేష వాచ్యవత్,

కషాయః - ॥న్న॥ ఇది బంకకును, పరిమళించుదానికిని, వగరునకును, సీసమునకును, కషాయమునకును, మైపూంతకును పేరు. ద్రవ్యవిశేషమునకు పేరగునపుడు విశేష్యలింగము.

ద్వితీయా సహధర్మిణ్యాం ద్వితీయం పూరణే త్రిషు. 333

ద్వితీయా - ఇది భార్యకు పేరైనపుడు ॥స్త్రీ॥ రెండవదియను నర్థమున ॥త్రి॥

త్రి ష్వహార్య స్థిరే నా ఽద్రౌ

ఆహార్యః-ఇది స్థిరమైనదానికి పేరైనపుడు ॥త్రి॥ పర్వతమునకు పేరైనపుడు ॥పు॥

నాదేయీ జలవేతసే, తర్కార్యాం భూమిజంబ్వాం చ జపాయాం నాగరఙ్గకే. 33౪. నాదేయం సిన్ధులవణే త్రిషు త్వేష నదీభవే,

నాదేయీ-ఇది నీరుప్రబ్బలికిని, తక్కిలిచెట్టునకును, సారదపుచెట్టునకును, పేరైనపుడు ॥స్త్రీ॥ ఇందుప్పునకుఁ బేరైనపుడు ॥న॥ నదియందుఁబుట్టినదానికిఁ బేరయినపుడు ॥త్రి॥

ఆతిథ్య మాతిథేయార్థే న స్త్వయో రతిథౌ పుమాన్.

ఆతిథ్యమ్-ఇదిఅతిథులకుఁ తగినయన్నాదులకు పేరయినపుడు ॥న॥ అతిథికి పేరైనపుడు ॥పు॥

ఇన్ద్రియే విషయ క్లీబం త్రిలిఙ్గో విషయాన్వితే, పుమాన్ రాజ్ఞి స్మరే చాథ

విషయి - ఇది చక్షురాదులకు పేరైనపుడు ॥న॥ విషయములతోఁగూడినవానికి పేరైనపుడు ॥త్రి॥ రాజునకును, మన్మథునికిని పేరయినపుడు ॥పు॥

పానీయం క్లీబ మమ్బు 33౫. పేయే త్రిషు

పానీయమ్ - ఇది ఉదకమునకు పేరైనపుడు ॥న॥ పానము చేయఁదగినదానికి పేరయినపుడు ॥త్రి॥

విహాయస్తు వ్యో మ్ని స్యా ద్విహగే పుమాన్,

విహాయః॥న్న॥ఇది ఆకాశమునకు పేరైనపుడు ॥న్న॥ పక్షిసామాన్యమునకు పేరైనపుడు ॥పు॥

వేశ్యా దాస్యో ర్భుజిష్య స్త్రీ ప్రేష్యస్వచ్ఛన్దయో స్త్రిషు. 33౬

భుజిష్యా-ఇది వేశ్యకును బానిసెకును పేరైనపుడు ॥స్త్రీ॥ కింకరునికిని, స్వతంత్రునికిని పేరైనపుడు ॥త్రి॥

పస్యా వ్రతచర్యాయాం
స్యః ఫాల్గునే పుమాన్,
్రత్రియం గరళే పార
కే క్షేత్రజేతృణే. ౩౭౯
త్స్వర్గ్యాన్యదేహే చ స్యా
ధ్యగదేఽపి చ,
,సవ్యం సవ్య ఆయత్తే
కూలానుకూలయోః.
ాన్యో వాగ్విదాతారౌ
ఁన్యో వన్త్యగర్హితౌ,

యాం నుజేఽత్యల్పే
యాన్ త్సత్తమేత్యురౌ.
౩౮౦
ధీయాం చ్ఛోభనేఽ
సాధౌ వసుమతేఽపిచ,
తీక్ష్యో ప్రతిపాల్యో

ష్వేతే క్షేత్రియాద
౩౮౧

ఇతి యాంతాః.

---

తశమ్భౌ శబరౌ
స్కరౌ సూర్యపావకౌ,
పరౌ యుగసన్దేహౌ

రౌ కరిసుత్తలౌ. ౩౮౨
సుతోష్ట్రౌ దాసేరౌ
రౌ శిఖికుక్కుటౌ,
హాషే శృఙ్గారౌ

తపస్యా-ఇది వ్రతానుష్ఠానమునకు పేరగునపుడు ॥స్త్రీ॥ ఫాల్గున మాసమునకుఁ బేరగునపుడు ॥పు॥

క్షేత్రియమ్॥న॥ ఇది విషమునకును, పరస్త్రీగర్భమునఁబుట్టిన శిశువునకును, పరిమడిలోఁ బుట్టినతృణమునకును, వైద్యము చేయఁ దగిన యన్యదేహమునకును, మాన్పనశక్యమైన రోగమునకును పేరు.

ప్రసవ్యమ్॥న॥ ఇది ప్రదక్షిణమునకును, అధీనమైనదానికిని, ప్రతికూలమునకును, అనుకూలమునకును పేరు.

వదాన్యః ॥పు॥ ఇది వక్తకును, దాతకును పేరు.

జఘన్యః ॥పు॥ ఇది కనిష్ఠునికిని, నిందింపఁబడినదానికిని నామము. [నామము.

కనీయాన్-॥న॥ ఇది తమ్మునికిని, మిక్కిలి యల్పమైనదానికిని

వరీయాన్-॥పు॥ ఇది శ్రేష్ఠునకును, మిక్కిలి పరుమైనదానికిని నామము.

సాధీయాన్ - ॥పు॥ శ్రేష్ఠునికిని, మిక్కిలిసాధువునకును, అంగీకరింపఁబడినవానికిని నామము.

ప్రతీక్ష్యః-॥పు॥ ఇది ఎదురుచూడఁదగినవానికిని, మొదటిదానికిని నామము.

క్షేత్రియాదయః=క్షేత్రియశబ్దము మొదలైన, ఏతే=ఈ యెనిమిదిశబ్దములును, త్రిషు=మూఁడులింగములయందును వర్తించును.

యాంతపదవర్గము ముగిసెను.

---

శబరః ॥పు॥ ఇది కిరాతునికిని, శివునకును నామము.

భాస్కరః ॥పు॥ ఇది సూర్యునికిని, అగ్నికిని నామము.

ద్వాపరః ॥పు॥ ఇది యుగభేదమునకును, సంశయమునకును నామము.

కుంజరః ॥పు॥ ఇది ఏనుఁగునకును, వెండ్రుకలకును నామము.

దాసేరః ॥పు॥ ఇది దాసీపుత్రునికిని, ఒంటెకును నామము.

విష్కిరః ॥పు॥ ఇది నెమలికిని, కోడికిని నామము.

శృంగారః ॥పు॥ ఇది రసభేదమునకును, గజాలంకారమునకును నామము.

వఙ్గారా భూసుతోల్ముకౌ.
ప్రకారా భేదసాదృశ్యే
వికారా రోగవిక్రియే,
కుమ్భీరా చోరభుజగౌ
కుటీరా కర్కటాలయౌ.
దైత్యారీ దేవగోవిన్దౌ
తిత్తిరీ మునిపక్షిణౌ,
శాఙ్కరీ స్కన్ద హేరమ్బౌ
సహూరీ వృషభాస్కరౌ.
హిమారీ వహ్నితపనౌ
జసురీ పవిపావకౌ,
ధాన్యోత్క్షేప తిరస్కారౌ నికారౌ
వః కూర్పరః. ౩౮౬. కఫోణిజాన్వో
రాకార స్త్వాకృతౌ గాత్ర వైకృతౌ,
మిహిరా వాయు చన్ద్రార్కాః
కేసరీ హరి సింహయోః.
ప్రస్తరా మణ్యశ్మకుథా
సంస్తరోఽధ్వరశయ్యయోః,
ఆకరా స్థానఖన్యోర్భూః
ప్రదరా భఙ్గకుచ్ఛరాః.
౩౮౭
ప్రకరః క్షీర్ణ పుష్పాదౌ సంహతౌ
మకరస్త్వహో, నిధౌ యాదసి రాశౌ చ

అంగారః ॥పు॥ ఇది అంగారకునికిని, కొఱవికిని నామము
ప్రకారః ॥పు॥ ఇది భేదమునకును, సాదృశ్యమునకును పే
వికారః॥పు॥ ఇది రోగమునకును, మనోవికారమునకును పే
కుంభీరః ॥పు॥ ఇది దొంగకును, సర్పమునకును నామము.
కుటీరః ॥పు॥ ఇది ఎండ్రకాయకును, గుడిసెకును నామము
దైత్యారిః ॥పు॥ ఇది దేవతలకును, విష్ణువునకును నామము
తిత్తిరిః ॥పు॥ తిత్తిరియనుమునికిని. తీతువుపక్షికిని నామము
శాంకరిః ॥పు॥ ఇది కుమారస్వామికిని, విఘ్నేశ్వరుని మఱియు నుమకును నామము.

సహూరిః ॥పు॥ ఎద్దునకును, సూర్యునికిని నామము.

హిమారిః ॥పు॥ ఇది అగ్నికిని, సూర్యునికిని నామము.

జసురిః ॥పు॥ ఇది వజ్రాయుధమునకును, అగ్నికిని నామము

నికారః ॥పు॥ ఇది ధాన్యముతూర్పుపట్టుటకును, తిరస్కా మునకును నామము.

కూర్పరః ॥పు॥ ఇది మోఁచేతిమొనకును, కాలిపిక్కకు నామము.

ఆకారః ॥పు॥ ఇది స్వరూపమునకును, శరీరవికారమునకు నామము.

మిహిరః ॥పు॥ ఇది వాయువునకును, చంద్రునికిని, సూర్యు కిని నామము.

కేసరీ ॥న్॥-ప్ర ఇది విష్ణువునకును నామము.

ప్రస్తరః ॥పు॥ ఇది మణికిని, శిలకును, వీనుఁగుమీఁదఁబఱ చెడు రత్నకంబళినికి నామము.

సంస్తరః ॥పు॥ ఇది యాగమునకును, పాన్పునకును పేరు.

ఆకరః ॥పు॥ ఇది స్థానమునకును, లోహరత్నాదులు పుట్టు [గనికిని, కూటమికిని నామము

ప్రదరః ॥పు॥ ఇది విఱుగుటకును, స్త్రీరక్తస్రావవ్యాధికిని బాణమునకును, నామము.

ప్రకరః ॥పు॥ ఇది వెదజల్లిన పుష్పాదులకును, సమూహము నకును నామము.

మకరః ॥పు॥ ఇది నిధిభేదమునకును, మొసలికిని, రాశిభేద మునకును నామము.

చఙ్కురస్తు ద్రుమే రథే.
కింశారు స్సస్యశూకే స్యా
న్నియకే కఙ్కపక్షిణి,
విష్టరః కుశముష్టౌ స్యా
త్రాద్యాసనవృక్షయోః.
ఖపురో లశునే పూగవృ
నిర్యాసపూగయోః,
కపాలే చ కటాహేచ భై
పాత్రే చ కర్పరః. 31౧
మందారః　పారిభద్రేఽ
ప్యర్కే కల్పమహీరుహే,
గాంధారస్తు స్వరే రాగే
శ సిన్దూరయో
రథ. కులాలదణ్డే ముకురో
ర్పణాదర్శయో రపి,
ఆధార ఆలవాలామ్బు బ
ఽధికరణేఽపిచ. 313
స్యా దాసారో　మిత్ర
లే వేగవృష్టిప్రసారయోః,
కేదార　శ్శృఙ్గరక్షేత్రే
లభేదాలవాలయోః.
మయూరో బర్హిచూడా
మ పామార్గే శిఖావళే,
నరేన్ద్రో విషవైద్యేఽపి
మహేన్ద్రః పతిశక్రయోః.
ఆశిరః　క్షీరవికృతౌ భో
నే పావకే రవౌ,
వికిరో వాలుకాయాం చ
విహార స్సుగతాలయే.
క్రీడాయాం చా
థ సంస్కార స్సంకల్ప

చంకురః-॥పు॥ ఇది వృక్షవిశేషమునకును, రథమునకును పేరు.

కింశారుః-॥పు॥ ఇది వరిముంటికిని, బాణమునకును, పెద్దగ్రద్ద కును నామము.

విష్టరః -॥పు॥ ఇది దర్భపిడికిని, పీఁట మొదలైన యాసనములకును, వృక్షమునకును నామము.

ఖపురః-॥పు॥ ఇది వెల్లుల్లికిని, పోఁక చెట్టునకును, బంకకును పోఁకకును నామము.

కర్పరః-॥పు॥ ఇది చెక్కలికిని, తొట్టికిని, భిక్షాపాత్రకును నామము.

మందారః-॥పు॥ ఇది పారిజాతపు చెట్టునకును, జిల్లేడుచెట్ట నకును, కల్పవృక్షమునకును నామము.

గాంధారః-॥పు॥ ఇది స్వరభేదమునకును, రాగవిశేషమునక ను, దేశభేదమునకును, సిందూరమునకును నామము.

ముకురః -॥పు॥ ఇది కుమ్మరసానం ద్రిప్పుదండమునకును, వ ణిదర్పణమునకును, అద్దమునకును నామము.

ఆధారః-॥పు॥ ఇది పాదులయందు కట్టకట్టి నీళ్లునిలుపఁగల ప్ర దేశమునకును, ఒకవస్తువునుంచెడు స్థలము మొదలైనయాధా ములకును పేరు.

ఆసారః -॥పు॥ ఇది స్నేహితబలమునకును, వేగమునకును వర్షధారాపతనమునకును పేరు.

కేదారః-॥పు॥ ఇది శివక్షేత్రమునకును, పర్వతవిశేషమున ను, మడికాలునకును పేరు.

మయూరః-॥పు॥ ఇది నెమలి శిరస్సునకును, ఉత్తరేణిచెట్ట నకును, నెమలికిని పేరు.　[తికిని పేరు

నరేంద్రః-॥పు॥ ఇది విషవైద్యునికిని, అపిశబ్దమువలన భూ

మహేంద్రః-॥పు॥ ఇది ప్రభువునకును, ఇంద్రునికిని పేరు.

ఆశిరః-॥పు॥ ఇది క్షీరవికారమునకును, భోజనమునకును, గ్నికిని, సూర్యునికిని పేరు.　[పేరు

వికిరః-॥పు॥ ఇది ఇసుకకును, చకారమువలన చల్లుటకును

విహారః-॥పు॥ ఇది బౌద్ధాలయమునకును, క్రీడకును పేరు.

సంస్కారః-॥పు॥ ఇది సంకల్పమునకును, స్వభావముగనున

ప్రతియత్న యోః,
శర్కరా తు గుడే రోగ
భేదే శర్కరిలస్థలే. 3౫౯.
శిలాభేదే సితాయాం చ శ
కలాల్పకపాలయోః,
గాయత్రీ ఖదిర శ్ఛన్దః
కృపాణ్యా మపి కర్తరీ.
సా సైరన్ధ్రీ యాఽన్యగృ
హే స్వాయత్తా శిల్పకారి
ణీ, వర్ణసఙ్కరజాయాం చ
కాఞ్చ్యాం ఛన్దసి శక్వరీ.
ఛత్రప్రాంతాలమ్బి వస్త్రే
కేశే వాద్యే చ ఝల్లరీ,
ఉర్వరా సర్వసస్యాఢ్య
భూమౌ భూమాత్రకేఽపిచ.
శైలవృక్షాగ్రయోః కో
ట్యాం కక్ష్యాయాం శిఖ
రం మతమ్,
కుహరం గహ్వరే ఛిద్రే
మన్దిరం నగరే గృహే.
ధ్వాన్తేఽక్షిరోగే తిమిర
మమ్బరం వ్యోమ్ని వాససి
ఔశీర శ్చామరే దణ్డే
కటిత్రం కటివాససి. 3౬౧
మేఖలాయాం
గుహాదమ్భ గహనేషు తు
గహ్వరమ్,
కటీరం కన్దరే కట్యాం
విషయే ఽఙ్గే ఽఙ్కణే
ఽజిరమ్. 3౬3
పుష్కర మమ్బుని ఖే భే

వస్తువులో గుణోత్కర్షము కలుగఁజేయుంటకును పేరు.

శర్కరా - ॥స్త్రీ॥ ఇది బెల్లమునకును, రోగవిశేషమునకు మొరముగలభూమికిని, పాషాణభేదమునకును, చక్కెరకును, నుకకును, చిల్లపెంకునకును పేరు.

[ను పే

గాయత్రీ-॥స్త్రీ॥ ఇది చండ్రచెట్టునకును, ఛందోభేదము

కర్తరీ-॥స్త్రీ॥ ఇది పెద్దకత్తికిని, అపిశబ్దమువలనకత్తెరకును పే

సైరంధ్రీ-॥స్త్రీ॥ ఇది ఏస్త్రీ యన్యులగృహమునందు వసించు స్వతంత్రురాలై స్త్రీల నలంకరించుచున్నదో యా స్త్రీకిని, బసిః నున్న స్త్రీకిని పేరు.

శక్వరీ-॥స్త్రీ॥ ఇది మొలనూలికిని, ఛందోభేదమునకును పే

ఝల్లరీ - ॥స్త్రీ॥ ఇది గొడుగుచుట్టువ్రేలవేసిన వస్త్రవిశేషమ కును, వెండ్రుకలకును, వాద్యవిశేషమునకును పేరు.

ఉర్వరా-॥స్త్రీ॥ ఇది సకలమైన పైర్లతోఁగూడిన భూమికి భూమాత్రమునకును పేరు.

శిఖరమ్-॥న॥ ఇది పర్వతముయొక్క తుదకును, వృక్షాగ్ర నకును, అంచునకును, మేడలతొట్టికట్టుటకును పేరు.

కుహరమ్-॥న॥ ఇది గుహకును, రంధ్రమునకును పేరు.

మందిరమ్-॥న॥ ఇది పత్తనమునకును గృహమునకును పే

తిమిరమ్-॥న॥ ఇది గాఢాంధకారమునకును, నేత్రరోగమ కును పేరు.

అంబరమ్-॥న॥ ఇది ఆకాశమునకును, వస్త్రమునకును పేరు

ఔశీరః-॥పు॥ ఇది చామరమునకును, కఱ్ఱకును పేరు.

కటిత్రమ్-॥న॥ ఇది మొలయందలి వస్త్రములకును, మొలను లికిని పేరు.

గహ్వరమ్-॥న॥ ఇది గుహకును, కపటమునకును, చొరఁగూ డనిదానికిని పేరు.

కటీరమ్-॥న॥ ఇది గుహకును, పిఱుఁదులకును పేరు.

అజిరమ్-॥న॥ ఇది శబ్దాదివిషయములకును, శరీరమునకును ముంగిలికిని పేరు.

పుష్కరమ్-॥న॥ ఇది ఉదకమునకును, ఆకాశమునకును,నక్ష

సుంధి వాద్యముఖే మదే
ఽపి ధారాయామ్, ద్వీపే
భేషజభేదే సారసతీర్థాహి
కరికరాగ్రేషు. ౩౬౪

దధికలశ గోమయామ్బుషు
కుశతామ్ర బ్రహ్మసూత్ర మ
న్త్రేషు, హేమ్న్యర్థే చ
పవిత్రం త్రిషు పూతే పుం
సి శమ్భుపావకయోః. ౩౬౫

కర్బురం హేమ్న్యఘే
తోయే దైత్యే నా శబలే
త్రిషు,

జర్ఝరో నాపితే శక్రధ్వ
జేఽక్లిన్నే తు వాచ్యవత్.
౩౬౬

దర్దురో నావి భేకే చ త్రి
ష్వీషద్భుగ్నవస్తుని,

కఞ్జరం కనకే క్లీబం పీతే
త్రిషు హయే పుమాన్.

గ్రీవాయాం కన్ధరా మే
ఘే పుమాన్

దేవేఽపి నిర్జరాః,

శార్వరం తమసి క్లీబం
హింస్రే త్రిష్వేషనా విధా.

నిశిథిన్యాం హరిద్రాయాం
సన్ధ్యాయాం చాఽపి శర్వరీ,

స్థణ్డిలాఙ్గణయోః క్లీబం చ
త్వరం నా చతుష్పథే.
౩౬౭

క్రియాకారప్రతిజ్ఞాపద్యు
ద్ధార్థే పుంసి సఙ్గరః,

త్రమునకును, యుద్ధమునకును, మద్దెల మొదలైన వాద్యములము
ఖమునకును, మదమునకును, కత్తివాదరకును, ద్వీపభేదమునకు
ను, ఔషధవిశేషమునకును, కమలమునకును, తీర్థవిశేషమునకును,
సర్పమునకును, ఏనుఁగుతొండముయొక్క కొనకును పేరు.

పవిత్రమ్-ఇది పెరుగుకడవకును, గోమయమునకును, ఉదక
మునకును, దర్భకును, రాగికిని, బ్రహ్మసూత్రమునకును, మంత్ర
మునకును, బంగారమునకును, ధనమునకును, పేరగునపుడు ॥న॥
పరిశుద్ధమైనదానికి పేరగునపుడు ॥త్రి॥ శివునికిని, అగ్నికి
పేరగునపుడు ॥పు॥

కర్బురమ్-ఇది బంగారమునకును, ఉదకమునకును, పాపమ
నకును పేరగునపుడు ॥న॥ రాక్షసునికి పేరగునపుడు ॥పు॥ చిత్ర
వర్ణముకలదానికి పేరగునపుడు ॥త్రి॥

జర్ఝరః - ఇది మంగలవానికిని, ఇంద్రధ్వజమునకు పేరగ
నపుడు ॥పు॥ ఒకటితోనొకటి కలియనిదానికి పేరగునపుడ
॥విశేష్యలింగము॥

దర్దురః-ఇది తెప్పకును, కప్పకును పేరగునపుడు ॥పు॥ ఇ
చుకవంగినదానికి పేరగునపుడు ॥త్రి॥

కంజరమ్-ఇది బంగారమునకు పేరగునపుడు ॥న॥ పచ్చని
నికి పేరగునపుడు ॥త్రి॥ గుఱ్ఱమునకు పేరగునపుడు ॥పు॥

కంధరా-ఇది కంఠమునకు పేరగునపుడు ॥స్త్రీ॥ మేఘమున
పేరగునపుడు ॥పు॥

నిర్జరః-ఇది దేవతలకు పేరగునపుడు ॥పు॥ అపిశబ్దమువ
ముసలితనములేనివారికి పేరగునపుడు ॥త్రి॥

శార్వరమ్-ఇది చీఁకటికి పేరగునపుడు ॥న॥ ఘాతుకు
పేరగునపుడు ॥త్రి॥ చంద్రునికి పేరగునపుడు ॥పు॥

శర్వరీ-ఇది రాత్రికిని, పసుపునకును, సంధ్యాకాలమ
కును పేరు.

చత్వరమ్-ఇది అగ్నిహోత్రము నుంచుటకొఱకు సంస్కా
ము చేయఁబడినస్థలమునకును, ముంగిలికిని పేరగునపుడు ॥న॥
లుగు తెరువులుగూడిన ప్రదేశమునకు పేరగునపుడు ॥పు॥

సంగరః-ఇది క్రియానిశ్చయమునకును, ప్రతిజ్ఞకును, ఆ
కును, యుద్ధమునకు పేరగునపుడు ॥పు॥ జమ్మిపండునకు

క్లీబే శమీఫలే
పాన్థ స్త్విత్వరః కుల
టేత్వరీ. ౩౭౦
శాక్వరో నా వృషే క్లీ
బం ఛన్దోభేదేఽ
థ నాగరమ్, ముస్తాశుం
ఠ్యో స్త్రీషు త్వేష విదగ్ధే
నగరోద్భవే. ౩౭౧
ప్రభా త్రి ష్వీశ్వర శ్శ
మ్భౌ నా
గౌర్యా మీశ్వ రేశ్వరీ,
కాంతారోఽస్త్రీ వనేదు
ర్వర్త్మ న్యక్షా న్తరే తు నా.
కుమారో మాసుతే స్క
న్దే యువరాజే ఽశ్వవాచ
, బాలే వరణవృక్షే చ నా
పే తు నపుంసకమ్ ౩౭౩
కుమారీ తు సహా గౌరీ క
కా నవమాలికా,
ష్ఠే పుం స్యధరోఽధ
ద్హీనే చ త్రిష్వ
ామరా. ౩౭౪. స్థూణా
మా చీన్ద్రపురీ దూర్వా
స్త్రీ సురే పుమాన్,
న్తరః పరిధానీయ స్వే
బాహ్యేషు వాచ్యవ
౩౭౫. అన్తరాత్మని
స్యేష వినార్థేఽవ్యయ
రా, అన్తరం వివరా
భేదే ష్వవధి మధ్య
ః. ౩౭౬. అవకాశా
మో స్తాదర్థ్యే న్యా

గునపుడు ॥న॥

ఇత్వరః-ఇది మార్గమునడుచువానికి పేరగునపుడు ॥పు॥ రం కులాడికి పేరగునపుడు-ఇత్వరీ ॥స్త్రీ॥

శాక్వరః-ఇది వృషభమునకు పేరగునపుడు ॥పు॥ ఛందస్సున కు పేరగునపుడు ॥న॥

నాగరమ్-ఇది భద్రముస్తలకును, శొంఠికిని పేరగునపుడు ॥న॥ చాతుర్యవంతునికిని, పట్టణమునం బుట్టినదానికిని పేరగునపుడు ॥త్రి॥

ఈశ్వరః-ఇది నిగ్రహానుగ్రహసమర్థులకును, మఱియు ప్రభువునకును పేరగునపుడు ॥త్రి॥ శివునికి పేరగునపుడు ॥పు॥

ఈశ్వరా-ఈశ్వరీ ॥స్త్రీ॥ ఈరెండును గౌరికి పేళ్లు.

కాంతారః-ఇది అడవికిని, చొరగూడనిమార్గమునకును పేరగునపుడు ॥పు॥ బండికంటినడుమునకు పేరగునపుడు ॥పు॥

కుమారః-ఇది మన్మథునికిని, కుమారస్వామికిని, యువరాజున కును, గుఱ్ఱమునకును, బాలునికిని, ఉలిమిరిచెట్టునకును పేరగు నపుడు ॥పు॥ కుమారద్వీపమునకు పేరగునపుడు ॥న॥

కుమారీ ॥స్త్రీ॥ ఇది చిన్నగోరింటకును, గౌరికిని, కన్యకకును, విరజాజికిని పేరు.

అధరః-ఇది పెదవికి పేరగునపుడు ॥పు॥ దిగువనున్నవస్తువు నకును, హీనునికిని పేరగునపుడు ॥త్రి॥

అమరా-ఇది స్తంభమునకును, తిప్పతీగెకును, ఇంద్రుని పురమునకును గరికెకును బేరగునపుడు ॥స్త్రీ॥ దేవతలకు పేరగు నపుడు ॥పు॥

అంతరః-ఇది కట్టుకోకకును, తనసంబంధమైన దానికిని, వెలుపలికిని పేరగునపుడు విశేష్యలింగము. పరమాత్మకు పేరగు నపుడు ॥పు॥ అది పెలిగా నను వినార్థమునందు అంతరా అని యవ్యయము, రంధ్రమునకును, మఱుగుపుటకును, విశేషమున కును, మర్యాదకును, మధ్యప్రదేశమునకును, ఎడమునకును, అవసరమునకును, దానికొఱకనునర్థమునకును, మఱియొకటి యను నర్థమునకును పేరగునపుడు ॥న॥

యోరపి,
ప్రతివా చ్యుత్తరం నా
। విరాటతనయే త్రిషు.
౭౭. కా లో దీ చ్యుత్త
హార్ధ్వేషు తారాభేదే దిశి
స్త్రియాం,
అక్షరం ప్రణవే ధర్మే ప్ర
్రతౌ తపసి క్రతౌ. ౩౭౮
ర్ణే మోక్షే చ నా త్వేష
పవిష్ణువిరిఞ్చిషు,
మృగ దానవ శాద్ధేషు శ
మ్బర శ్శమ్బరీ వృషా. ౩౭౯
జే వ్రతామ్బువిత్తేషు

సుషిర స్త్వనలే పుమాన్,
్రషు రంధ్రాన్వితే క్లీబే
ద్రవంశాది వాద్యయోః.
క్లీబం లోహే పుమాన్
శమే కవాటార్థే ఽరరం
నా,
కరీరో నా ఘటే వృక్షే
స్త్రియాం వైణవాఙ్కురే.
మత్సరో ఽన్యోదయద్వే
। తద్వ త్కృపణయో
త్రిషు.
అసృక్కుఙ్కుమయోః క్లీ
ంరుధిరంభూసు తేపుమాన్.
మధురో నా రసే తద్వ
స్వద్వరస్వాదుషు త్రిషు,
ధురా శతపుష్పా చ

ఉత్తరమ్ - ఇది ప్రత్యుత్తరమునకు పేరగునపుడు ॥న॥ విరాటుని పుత్రునికి పేరగునపుడు ॥పు॥ కాలవిశేషమునకును, ఉత్తరదేశము మొదలైనదానికిని, శ్రేష్ఠునికిని, మీఁదనున్న దానికిని పేరగునపుడు ॥త్రి॥ నక్షత్రమునకును, ఉత్తరదిక్కునకును పేరగునపుడు ॥స్త్రీ॥

అక్షరమ్-ఇది ఓంకారమునకును, ప్రకృతికిని, తపస్సునకును, యాగమునకును, అకారాదివర్ణములకును, మోక్షమునకును పేరగునపుడు ॥న॥ శివునికిని, విష్ణువునకును, బ్రహ్మకును పేరగునపుడు ॥పు॥

శంబరమ్-ఇది మృగవిశేషమునకును, రాక్షసునికిని, శాద్ధునికిని పేరగునపుడు ॥పు॥ ఎలికచెవిపూరకు పేరగునపుడు, శంబరీ ॥స్త్రీ॥ వ్రతవిశేషమునకును, ఉదకమునకును, ధనమునకును పేరగునపుడు ॥న॥

సుషిరః - ఇది అగ్నికి పేరగునపుడు ॥పు॥ రంధ్రముగలదానికి పేరగునపుడు ॥త్రి॥ రంధ్రమునకును, పిల్లనగ్రోవి మొదలైనవాద్యములకును పేరగునపుడు ॥న॥

అరరమ్ - ఇది లోహమునకు పేరగునపుడు ॥న॥ చంద్రునికి పేరగునపుడు ॥పు॥ తలుపునకు పేరగునపుడు ॥ప్న॥

కరీరః - ఇది ఘటమునకును, వెణుతురుచెట్టునకును పేరగునపుడు ॥పు॥ వెదురుమొలకకు పేరగునపుడు ॥స్న॥

మత్సరః - ఇది పరుల సంపదయందలి ద్వేషమునకు పేరగునపుడు ॥పు॥ ఆద్వేషముగల వానికిని, ఇంచుక లాభమునకై సకలావమానములను సహించువానికిని పేరగునపుడు ॥త్రి॥

రుధిరమ్-ఇది నెత్తురునకును, కుంకుమకును పేరగునపుడు ॥న॥ అంగారకునికిఁ పేరగునపుడు ॥పు॥

మధురః - ఇది రసభేదమునకుఁ పేరగునపుడు ॥పు॥ మధురరసముగల దానికిని, ఒప్పిదమైన దానికిని, రుచిగలదానికిని పేరగునపుడు ॥త్రి॥ అడవిసదాపకును, చకారమువలన మధురాపురమునకును పేరగునపుడు ॥స్త్రీ॥

ఋతే నా
జఠరం క్లీబ ముదరే కఠినే
త్రిషు,
ధూసరో వర్ణ ఖరయోః రీ
షత్పాణ్డౌ తు వాచ్యవత్.
సింహాశ్వయోశ్చ కేశేషు
కిఞ్జల్కే కేసరోఽస్త్రియాం,
నాగకేసర పున్నాగ వకుళే
షు పుమా నయమ్. ౩౦౫
సాముద్రం లవణాదౌ త్రి
ష్వయం క్లీబేఽఙ్గలక్షణే,
ధ్వాన్తరాత్రౌ చ రాత్రౌ
చ తమిస్రాతిమిరే ననా.
చికురోఽహౌ గేహబభ్రౌ
కేశే త్రిషు తు చఞ్చలే,
హిమశీకరయోః పుంసి తు
షార శ్శీతలే త్రిషు. ౩౦౬
చమరో నా మృగే క్లీబం
చామరేఽ
థ త్రిషూత్తరే,
ఉదారో దక్షిణే ఖ్యాతే
దానశౌణ్డే మహత్యపి.
కాలేఽప్యశృఙ్గో గౌశ్శ్మ శ
స్రురహితో నాచ తూబరః,
ధీరై కతానా వేకాగ్రౌ
భఙ్గురౌ వక్రనశ్వరౌ.
౩౦౭
విధురౌ కష్టవిశ్లిష్టౌ
వజ్ఞనీచౌ తు పామరౌ,

మునకుఁ బేరగునపుడు ॥పు॥

జఠరమ్ - ఇది ఉదరమునకుఁ బేరగునపుడు ॥న॥ కఠినమై దానికిఁ బేరగునపుడు ॥త్రి॥

ధూసరః - ఇది వర్ణవిశేషమునకును, గాడిదెకును బేరైనపు ॥పు॥ కొంచెము తెల్పుగలదానికిఁ బేరైనపుడు విశేష్యలింగమ

కేసరః - ఇది సింహము, గుఱ్ఱము వీనియొక్క మెడవెండ్రు కలకును, ఆకరుపువ్వులకును బేరైనపుడు ॥ప్న॥ నాగకేస మునకును, సురపొన్నకును, అశోకవృక్షమునకును బేరగునపు ॥పు॥

సాముద్రమ్-ఇది సముద్రమునఁబుట్టిన యుప్పు మొదలయి వానికిఁ బేరైనపుడు ॥త్రి॥ అంగలక్షణములకుఁ బేరైనపుడు ॥

తమిస్రా - ఇది చీఁకటిగల రాత్రికిని, సామాన్యరాత్రికి బేరైనపుడు ॥స్త్రీ॥ చీఁకటికిఁ బేరగునపుడు ॥ప్న॥

చికురః - ఇది సర్పమునకును, బల్లికిని, తలవెండ్రుకలకు బేరైనపుడు ॥పు॥ చంచలమైనదానికిఁ బేరైనపుడు ॥త్రి॥

తుషారః - ఇది మంచునకును, తుంపరలకును బేరగునపు ॥పు॥ చల్లనిదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

చమరః - ఇది సవరపు మృగమునకుఁ బేరగునపుడు ॥పు వింజామరకుఁ బేరగునపుడు ॥న॥

అథ = ఈశబ్దమునకుఁ బిమ్మట, ఉత్తరే = మీఁదజెప్పఁగ శబ్దములన్నియుం, అనఁగా నుదారశబ్దము మొదలుకొని యిత శబ్దమువఱకుగల యోనిమిదిశబ్దములు, త్రిషు = మూఁడులిం ములయందును వర్తించును.

ఉదారః - ॥పు॥ ఇది నేర్పరికిని, ప్రసిద్ధికిని, దానశీలునికిని దొడ్డవానికిని బేరు.

తూబరః - ॥పు॥ ఇది కాలమున గొమ్ములురాని యెద్దునకును గడ్డము మీసములు రాని బేడివానికిని బేరు.

ఏకాగ్రః - ॥పు॥ ఇది ధీరునికిని, ఏకాగ్రచిత్తునకును బేరు

భంగురః - ॥పు॥ ఇది వక్రమైనదానికిని, నశించు స్వభావము గలదానికిని బేరు. [కును బేరు

విధురః-॥పు॥ ఇది కష్టమును బొందినవానికిని, యోగవంతు

పామరః-॥పు॥ ఇది మూఢునికిని, నీచునకును బేరు.

చతురౌ దక్షధీమన్తౌ
ఇతరౌ వన్యపామరౌ.
ఇతి రేఫాన్తాః.

---

ఉల్లోలవార్ధౌ కల్లోలౌ
దేహాత్మానౌ తు ముద్గలౌ,
కున్తలౌ దేశచికురౌ
సృగాలౌ దైత్యజమ్బుకౌ.
కోకిలౌ వుల్ముకపికౌ
జమ్బాలౌ పఙ్కశైవలౌ,
సర్పభేదే చ దుత్తూరే మా
తృభ్రాతరి మాతులః. ౩౯౨

జగలః పిష్టమద్యే స్యా
త్కితవేఽపి చ మోదకే,
కుమ్భీల స్తస్కరే నక్రే
పథి ఛ్ఛాయాపహారేఽపి సః.
కాకోలస్తు ద్రోణకాకే వి
షభేద కులాలయోః,
శార్దూలో దానవే వ్యా
ఘ్రే శ్రేష్ఠేతూత్తరతస్స్థితః.
వఞ్జుళ స్తిత్తికాశోక వేత
సే ష్వ
థ మేఖలా, కాఞ్చ్యాం
దా మ్న్యద్రికటకే శ్రోణి
స్థానాసిబన్ధయోః, ౩౯౩
శృఙ్ఖలం పుంస్కటీ వస్త్ర
బన్ధేఽపి

కదళీ మృగే, రంభాయాం

చతురః - ॥పు॥ ఇది సమర్థునికిని, బుద్ధిమంతునకును పేరు.
ఇతరః - ॥పు॥ ఇది అన్యునకును, వివేకహీనునకును పేరు.
రేఫాంతపదవర్గము ముగిసెను.

---

కల్లోలః-॥పు॥ఇది గొప్పకెరుల్లకును, సంతోషమునకును పేరు.
ముద్గలః - ॥పు॥ ఇది దేహమునకును, ఆత్మకును పేరు.
కుంతలః-॥పు॥ఇది దేశభేదమునకును, తలవెండ్రుకలకును పేరు
సృగాలః - ॥పు॥ ఇది దైత్యునికిని, నక్కకును పేరు.
కోకిలః - ॥పు॥ ఇది కొఱవికిని, కోకిలపక్షికిని పేరు.
జంబాలః - ॥పు॥ ఇది అడుసునకును, పాచికిని పేరు.
మాతులః - ॥పు॥ ఇది పొడమైనదేహమును, తోకయందును కలిగి నాలుగుపాదములతోను మ్మైత్తలతోను సంచరించు ముళ్లపామునకును, ఉమ్మెత్తచెట్టునకును, మేనమామకును, చకారము వలన మాదీఫలపు చెట్టునకును పేరు.

జగలః - ఇది పిండిపాలకును, జూదగానికిని, మోదకమను భక్ష్యవిశేషమునకును పేరు.
కుంభీలః-ఇది దొంగకును, మొసలికిని, మార్గమున ఛాయను గ్రహించి మార్గస్థుల హింసించు భూతమునకును పేరు.
కాకోలః - ॥పు॥ ఇది మాలకాకికిని, విషవిశేషమునకును కుమ్మరవానికిని పేరు.
శార్దూలః - ॥పు॥ ఇది రాక్షసునికిని, పెద్దపులికిని, ఉత్తరపదమయినపుడు శ్రేష్ఠునకును పేరు.
వంజుళః-॥పు॥ ఇది గుమ్మిచెట్టునకును, అశోకవృక్షమునకును ప్రబ్బలిచెట్టునకును పేరు.
మేఖలా - ॥స్త్రీ॥ ఇది మొలనూలికిని, పలుపునకును, కొండనడుమునకును, పిఱుదుల ప్రదేశమునకును, కత్తి చిలకట్రా కిని పేరు.
శృంఖలమ్-॥త్రి॥ ఇది మొగవాని కట్టువస్త్రమును బిగించెత్రాడు మొదలయినవానికిని, అపశబ్దమువలన బంధసాధనమైన గొలుసులు మొదలైనవానికిని పేరు.
కదళీ-॥స్త్రీ॥ఇదిబొల్లిచాయమెడచాఱలుకలిగినబిలములోనుం

మహిళా భీరుగన్ధ్ర్యోః
౩౯౬
వృషల్యృతుమతీ వన్ధ్యా
శూద్రాకన్యా మృతప్రజా,
శకలం వల్కలే ఖణ్డే
పలలం మాంసపంకయోః.
౩౯౭ తిలచూర్ణే౽
థ పటలం బృన్దే ఛదిషి
దృగ్రుజే,
కువలం బదరే ముక్తాఫలే
కువలయే౽పి చ. ౩౯౮
నాబిలం నాభిఖణ్డే చ వం
క్షణే చోత్తమస్త్రియామ్,
పాతాళం బాడబాగ్నౌ చ
కీలాల మసృగమ్బునోః.
౩౯౯. ఫణభాగే
దుకూలం తు క్షౌమే సూ
క్ష్మాంశుకేచ తత్,
లాఙ్గూలం మేహనే పుచ్ఛే
శమలం శకృ జ్జేనసోః.
కమలం ఛురికాదీనాం
హేమాద్యై శ్చిత్రితాజినే,
ఃమ్నా వ్యషధే౽రుణాబ్జే
౽పి కమలా శ్రీ వరస్త్రి
యోః. ౪౦౧
కుకూలం శఙ్కు సంకీర్ణే
శ్వభ్రే పుంసి తుషానలే,
వాత్యాయా మసి వాతూ
స్సతు వాతాసహే త్రి
షు. ౪౦౨
చపలః పారదే కీశే పు

మహిళా - ॥స్త్రీ॥ ఇది భయముగలస్త్రీకిని, ప్రేంకణపు చె
నకును పేరు.

వృషలీ - ॥స్త్రీ॥ ఇది అంటువీడిన స్త్రీకిని, గొడ్రాలికిని, శూ
కన్యకును, చచ్చినబిడ్డలగన్న స్త్రీకిని పేరు.

శకలమ్ - ॥న॥ ఇది నారచీరకును, తునుకకును పేరు.

పలలమ్ - ॥న॥ ఇది మాంసమునకును, అడుసునకును, నువ
పిండికిని పేరు.

పటలమ్-ఇది సమూహమునకును పేరైనపుడు ॥పు॥ ఇం
కప్పునకును, నేత్రరోగమునకును పేరైనపుడు ॥న॥

కువలమ్-॥న॥ ఇది రేఁగుఁబండునకును, ముత్యమునకును, క
వకును పేరు.

నాబిలమ్ - ఇది కస్తూరిఖండమునకును, గజ్జకును, ఉత్త
స్త్రీకిని పేరు. [లోకమునకును పే

పాతాళమ్ - ॥న॥ ఇది బడబాగ్నికిని, చకారమువలన నా

కీలాలమ్ - ॥న॥ ఇది నెత్తురునకును, ఉదకమునకును, పాం
పడిగెయొక్క భాగమునకును పేరు.

దుకూలమ్ - ॥న॥ ఇది వెలి పట్టుచీరకును, సన్నపు వలువకు
పేరు.

లాంగూలమ్ - ॥న॥ శిశ్నమునకును, తోఁకకును పేరు.

శమలమ్-॥న॥ ఇది అమేధ్యమునకును, పాపమునకును పే

కమలమ్-ఇది చురకత్తి మొదలైనవానికిని, బంగారుచిత్త
వుతోఁ జేయఁబడిన తోలుఁఒరకును, కడుపులోని నీరుతిత్తికి
ఔషధవిశేషమునకును, ఎఱ్ఱదామరపువ్వునకును పేరగునపు
॥న॥ లక్ష్మీదేవికిని, ఉత్తమస్త్రీకిని పేరగునపుడు ॥స్త్రీ॥

కుకూలమ్ - ఇది మేకులునాటిన గుంటకు పేరగునపుడు ॥
కుమ్మునకు పేరగునపుడు ॥పు॥

వాతూలః - ఇది వాయుసమూహమునకును, అపిశబ్దమువల
వాతూలాగమునకును, ఉన్మత్తునికిని పేరగునపుడు ॥పు॥ వాయ
వును సహింపనివానికి పేరగునపుడు ॥త్రి॥

చపలః - ఇది పాదరసమునకును, కోఁతికిని పేరగునపుడ

పర్విసీతే ద్రుతే నీచే చప
ా తటితి స్త్రియామ్.
తరళో హారమధ్యస్థమణౌ
గా చఞ్చలే త్రిషు,
పర్యాప్తౌ సుకృతే క్షే
మే కుశలం నిపుణే త్రిషు.
త్రిషు శ్లేష్మే సితే ర
మ్యే ధవళో నా గుణే భ
వేత్, ధవళా గవ్య
ధాశ్వత్థే పక్షిభేదేఽపి పి
ప్పలః. ౪౦౫. క్లీబం వస్త్ర
ఛేదభేదే సలిలే పిప్పలీ క
ణా,
బహులోఽగ్నౌ కృష్ణప
క్షే పుమాం స్త్రీ ష్వసితే
బహూ. ౪౦౬. ఏలా భూ
కృత్తికా గోషు బహులా
స్యా ద
థోపలా, శర్కరాయాం
దృషత్పుత్రే స్త్రీన త్ర్య
శ్మని నా మణౌ. ౪౦౭
పిఙ్గళోఽగ్నౌ మణౌ కీ
శే చణ్డాంశోః పారిపార్శ్వ
కే, త్రి ష్వయం కపిలే యా
మ్యదిక్కరిణ్యాంతుపిఙ్గళా.
కమ్బలోఽహిః క్రిమిస్సా
స్నా ప్రావారః కమ్బళం
జలమ్,
జాఙ్గలం నిర్జనస్థానే త్రిషు
మాంసే నపుంసకమ్. ౪౦౮
కన్దళీ మృగభేదే స్యా

దానికిని, నీచమైనదానికిని పేరగునపుడు ॥త్రి॥ మెఱుపునకును, లక్ష్మికిని పేరగునపుడు ॥సీ॥

తరళః-ఇది హారమధ్యమునందు నాయకమణికి పేరగునపుడు ॥పు॥ చంచలమైనదానికి పేరగునపుడు ॥త్రి॥

కుశలం-ఇది సామర్థ్యమునకును, పుణ్యమునకును, లబ్ధసిద్ధికరణమునకును పేరగునపుడు ॥న॥ నేర్పరికి పేరగునపుడు ॥త్రి॥

ధవళః-ఇది శ్రేష్ఠమైనదానికిని, తెల్లనిదానికిని, ఒప్పిదమైనదానికిని పేరగునపుడు ॥త్రి॥ తెలుపునకు పేరగునపుడు ॥పు॥ తెల్లనిగోవునకు పేరగునపుడు ॥సీ॥

పిప్పలః-ఇది రావిమ్రానికిని, పక్షివిశేషమునకును పేరగునపుడు ॥పు॥ వస్త్రమునకును, ఖండభేదమునకును, ఉదకమునకును పేరగునపుడు ॥న॥ పిప్పలికి పేరగునపుడు ॥సీ॥ పిప్పలీ.

బహులః-ఇది అగ్నికిని, కృష్ణపక్షమునకును పేరగునపుడు ॥పు॥ నల్లనిదానికిని, విస్తారమైనదానికిని పేరగునపుడు ॥త్రి॥ ఏలకులకును, భూమికిని, కృత్తికానక్షత్రమునకును, ఆవునకును పేరైనపుడు ॥సీ॥ ఇచ్చట కృత్తికానక్షత్రమునకు పేరైనపుడు స్త్రీలింగమును,బహువచనమునని యమరసింహుఁడు చెప్పెను.

ఉపలా - ఇది మొరమంటికిని, నూఱుడుఱాతికిని పేరగునపుడు ॥సీ॥ సామాన్యముగా ఱాతికి పేరగునపుడు ॥ప్న॥ మణికి పేరగునపుడు ॥పు॥

పింగళః-ఇది అగ్నికిని, కోఁతికిని, సూర్యునికిని, పార్శ్వమునందుండు విఘ్నదేవతకును పేరగునపుడు ॥పు॥ పచ్చవన్నెగదానికి పేరగునపుడు ॥త్రి॥ దక్షిణదిగ్గజముయొక్క భార్యకు పేరగునపుడు ॥సీ॥

కంబళః-ఇది సర్పవిశేషమునకును, కంబళిపురుగునకును, గంగడోలునకును, ఉత్తరీయమునకును పేరగునపుడు ॥త్రి॥ ఉదకమునకు పేరగునపుడు ॥న॥

జాంగలమ్-ఇది జనరహితస్థలమునకు పేరగునపుడు ॥త్రి॥ మాంసమునకు పేరగునపుడు ॥న॥

కందళీ - ॥సీ॥ఇది దొడ్డకడుపును నల్లనిముందరకాళ్లును గల మృగవిశేషమునకును పేరు.

కన్దళం తు నవాఙ్కురే,
కుణ్డలం వర్తులం పాశః
భూషాఽ
కుణ్డలీ. ౪౧౦. భుజఙ్గే
వక్రమృగే నా కుణ్డలవతి
షు,
మణ్డలీ నా రాజ్ఞి సూర్యేశ
ఽహికాశ్వబిడాలయోః.
మణ్డలం న ద్వయోః కు
బృంప సూర్యక భేకయోః,
ష్ట్వ ద్వాదశరాజౌఘే నికు
మ్బేఽ
ఫేనిలః. ౪౧౨. పు
నరిష్టే బదరేక్లీబే ఫేన
త్రిషు,
శుప్రీవకాపాటలో నా
బల్యాం గవి పాటలా.
ంతు పాటలీపుష్పే శ్వేత
త్వయం త్రిషు,
ఙ్గారే నా వికసితే స్వ
దీప్తే త్రిషూజ్జ్వలః.
౪౧౪
కాదణ్డే ప్రవాళోఽ
విద్రుమే నవపల్లవే,
ప్రవారు ణ్యుజ్జయిన్యో
లా పృథులే త్రిషు.
వలోఽద్రౌ భువ్యచలా
పిలాఽఽగ్నేయధేనుకా
ంపా రేణుకా గౌశ్చ
నా పిఙ్గళే త్రిషు.
౪౧౬

కందళమ్-॥న॥ ఇది క్రొత్తమొలకకు పేరు.

కుండలమ్-॥న॥ ఇది వట్రువకును, త్రాటికిని, కర్ణభూష
నకును పేరు.

కుండలీ-॥న్-పు॥ ఇది సర్పమునకును, పెద్దపులికిని పేర
డు ॥పు॥ కుండలములుగలవానికి పేరగునపుడు ॥త్రి॥

మండలీ-॥న్-పు॥ఇది రాజునకును, సూర్యునికిని, ఇంద్ర
సర్పమునకును, కుక్కకును, పిల్లికిని పేరు.

మండలమ్-॥న॥ ఎట్టపులుము అను రోగమునకును, పరివే
నకును, కప్పకును, బింబమునకును, యుద్ధకాలమున రా
ముందు వెనుకలుండు ౧౨ రాజులగుంపునకును, సమూహ
కును పేరు.

ఫేనిలః-ఇది కుంకుడుచెట్టుకు పేరగునపుడు ॥పు॥ రే
డునకు పేరగునపుడు॥న॥నురుఁగుగలదానికి పేరగునపుడు

పాటలః-ఇది ఎఱ్ఱనివడ్లకు పేరగునపుడు ॥పు॥ కలిగొ
ట్టునకును, ఎఱ్ఱనియావునకును పేరగునపుడు ॥సీ॥ కలిగొట్టు
ష్పమునకు పేరగునపుడు ॥న॥ తెలుపునెఱుపుగూడిన వర్ణ
పేరగునపుడు ॥త్రి॥

ఉజ్జ్వలః-ఇది శృంగారమునకు పేరగునపుడు ॥పు॥
చినదానికిని, స్వచ్ఛమైనదానికిని, ప్రకాశమైనదానికిని
నపుడు ॥త్రి॥

ప్రవాళః ॥పు॥ ఇది వీణాదండమునకును, పవడమున
లేఁతచిగురునకును పేరు.

విశాలా-ఇది పెద్దపాపరతీఁగెకును, ఉజ్జయినీపురమున
పేరైనపుడు ॥సీ॥ విశాలమైనదానికి పేరైనపుడు ॥త్రి॥

అచలః-ఇది పర్వతమునకు పేరగునపుడు ॥పు॥ భూ
పేరగునపుడు ॥సీ॥

కపిలా-ఇది ఆగ్నేయదిక్కుననుండు నాఁడయేనుఁగున
కంపుగల యిరుగుడుమ్రానికిని, తకోృలమునకును, కపిలగో
నకును పేరైనపుడు ॥సీ॥ మునికిఁ బేరైనపుడు ॥పు॥ గోరోచ
వంటి వన్నెగలదానికిఁ బేరైనపుడు ॥త్రి॥

రసాలా మార్జికా దూ
ర్వా జిహ్వా నా త్విక్షు
చూతయోః,
నిర్ణీతే కేవలం క్లీబం త్రి
షు స్యా దేకకృత్స్నయోః,
సీలీ ధాత్ర్యోః శ్రీఫలీ
స్త్రీ బిల్వే పుంస్య
థ చఞ్చలా, తటిల్లక్ష్మ్యోః
స్త్రీలిఙ్గోఽయం చపలే
థ త్రిషూత్తరే. ౪౧౮

రసాలా - ఇది దధిశర్కరాదులచేతఁ జేయఁబడినలేహ్యమునకును, దూర్వకును, నాలుకకును పేరైనపుడు ॥స్త్రీ॥ చెఱకుయొక్క భేదమునకును, తియ్యమామిడిచెట్టునకును పేరైనపుడు ॥పు॥

కేవలమ్-ఇదినిర్ణయింపఁబడినదానికిఁ బేరగునపుడు ॥న॥ ఒకటికిని, అంతటికిని పేరగునపుడు ॥త్రి॥

శ్రీఫలీ-ఇది నీలిచెట్టునకును, ఉసిరికచెట్టునకును పేరగునపుడు ॥స్త్రీ॥ బిల్వచెట్టునకుఁ బేరగునపుడు-శ్రీఫలః ॥పు॥

చఞ్చలా-ఇది మెఱుపునకును, లక్ష్మికిని పేరగునపుడు ॥స్త్రీ॥ చపలమైనదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

అథ=ఇది మొదలు, ఉత్తరే=మీఁదఁ జెప్పఁగలబహుళశబ్దమువఱకు, త్రిషు=మూఁడులింగములయందువర్తించును.

కరాళం ద న్తురే తుఙ్గే భీ
షణే చా
థసంకులం, పరస్పరాహతవ
చస్యుత్కీర్ణవ్యాకులేఽపిచ.
పేశలా చారు చతురా
పూర్ణశ్రేష్ఠౌ తు పుష్కలౌ,
ఉత్తాలా వుత్కటశ్రేష్ఠౌ
వాభీలౌ కృచ్ఛ్రభీషణౌ.
అఖిలౌ గర్హ్యనిశ్శేషౌ
బహులౌ సాన్ద్రపుష్కలౌ,
ఇతి లాన్తాః.

కరాళమ్-॥న॥ ఇది మిట్టపండ్లవానికిని, ఉన్నతమైనదానికిని భయంకరమైనదానికిని పేరు.

సఙ్కులమ్-॥న॥ ఇది పరస్పరము కొట్టువడినవాక్కునకును మఱియొకదానితోఁ గలిసినదానికిని, ఆకులమైనదానికిని పేరు

పేశలః-॥పు॥ ఇది ఒప్పిదమైనదానికిని, నేర్పరికిని పేరు.

పుష్కలః-॥పు॥ ఇది నిండినదానికిని, శ్రేష్ఠునికిని పేరు.

ఉత్తాలః-॥పు॥ఇదిఅతిశయమైనదానికిని, శ్రేష్ఠమైనదానికి [పేరు

ఆభీలః-॥పు॥ఇదికష్టమైనదానికిని,భయంకరమైనదానికిని పేరు

అఖిలః-॥పు॥ఇది నింద్యమైనదానికిని, మిగతలేనిదానికిని పేరు

బహులః-॥పు॥ ఇది దట్టమైనదానికిని, నిండినదానికిని పేరు

లాంతపదవర్గము ముగిసెను.

---

మన్త్రీ సహాయ స్సచివౌ
వృషశ్రేష్ఠే తు పుఙ్గవౌ. ౪౨౧

సచివః-॥పు॥ ఇది మంత్రికిని, తోడైనవానికిని పేరు.

పుంగవః-॥పు॥ ఇది ఎద్దునకును, ఉత్తరపదమైనప్పుడు శ్రేష్ఠునికిని పేరు.

పల్లవౌ సూర్యగోపాలౌ
మునిలోధ్రౌ తు గాలవౌ,
కితవౌ ధూర్తదుత్తూరౌ
వాహవౌ యాగసఙ్గరౌ.
ప్రసవౌ స్యూతి వీణాఙ్గే
ప్రభావౌ శక్తితేజసీ,

పల్లవః-॥పు॥ ఇది సూర్యునికిని, గోవులమేపరికిని పేరు.

గాలవః-॥పు॥ఇదిఒకానొకమునికిని,లొద్దుగచెట్టునకును పేరు

కితవః-॥పు॥ఇది జూదగానికిని, ఉమ్మెత్తచెట్టునకును పేరు.

ఆహవః-॥పు॥ ఇది యాగమునకును, యుద్ధమునకును పే

ప్రసవః-॥పు॥ఇదిప్రసవమునకును, వీణయొక్కకరివెకును పే

ప్రభావః-॥పు॥ ఇది సామర్థ్యమునకును, తేజస్సునకును పే

త్రిదివౌ గగనస్వర్గౌ
సుహృద్బన్ధూచ బాన్ధవౌ.
ప్రభవో విక్రమేఽబ్దే చ
మూలే జననకారణే, ఆద్యో
పలబ్ధయే స్థానే
వివస్వాంస్తు సురే రవౌ.
ప్రసవః పుష్పఫలయో ర్జ
నానుజ్ఞయో స్సుతే, పా
ంపర్యప్రసఙ్గే చ ప్రాణి
ర్భవిమోచనే. ౪౨౫
ఉత్సవః కోపమహయో
ఉత్సేకేచ్ఛాప్రసారయోః,
అవిశ్వాసాపహ్నవయోర్ని
ృతౌ చాపి నిహ్నవః.
గజస్కన్ధేఽపి పణవో
గన్ధర్వో గాయకే మృగే,
న్తరాభవసత్త్వేఽశ్వే
థా శ్రవోవచనస్థితే. ౪౨౬
ప్రతిజ్ఞానే
చోద్ధవస్తు స్యాన్మహోత్స
మన్త్రిణి,
సుషవీ స్త్రీ కారవేల్లే జీర
కృష్ణజీరకే. ౪౨౭
భైరవో నా క్షేత్రపాల
యో ర్భీషణే త్రిషు,
ష్ణౌ వసన్తే వైశాఖే మా
మాధవీ లతా. ౪౨౮. ౪
యా మపి శోభాయాం
మసమ్బన్ధిని త్రిషు,
న్ధవో లవణే న స్త్రీ

త్రిదివః-॥పు॥ ఇది ఆకాశమునకును, స్వర్గమునకును పే

బాంధవః-॥పు॥ ఇది స్నేహితునకును, బంధువునకును పే

ప్రభవః-॥పు॥ ఇది పరాక్రమమునకును, సంవత్సరమున మొదటిదానికిని, జననకారణమైనదానికిని, మొదట నెఱి టకు స్థానమైనదానికిని పేరు.

వివస్వాన్-॥త్-పు॥ ఇది దేవతకును, సూర్యునికిని పేరు

ప్రసవః-॥పు॥ఇది పుష్పమునకును, ఫలమునకును, పుట్టుకకు అనుజ్ఞకును, కుమారునికిని, పారంపర్యప్రసంగమునకును, ప్ర తికిని పేరు.

ఉత్సవః-॥పు॥ ఇది కోపమునకును, పండుగకును, ఉప్పొ గుటకును, ఇచ్ఛపుట్టుటకును పేరు.

నిహ్నవః-॥పు॥ ఇది అవిశ్వాసమునకును, దాచుటకును, స్కరించుటకును, అపశబ్దముపలన కపటమునకును పేరు.

పణవః-॥పు॥ ఇది ఏనుఁగు మూఁపునకును, అపశబ్దముః నుడుక యను వాద్యవిశేషమునకును పేరు.

గంధర్వః-॥పు॥ ఇది గాయకునికిని, మృగవిశేషమునకు అంతరపిశాచమునకును, గుఱ్ఱమునకును పేరు.

ఆశ్రవః-॥పు॥ ఇది చెప్పినట్లు వినువానికిని, అంగీకారః కును పేరు.

ఉద్ధవః-॥పు॥ ఇది పండుగకును, కృష్ణునిమంత్రికిని పేరు

సుషవీ-॥స్త్రీ॥ ఇది కాకరతీఁగెకును, జీలకఱ్ఱకును, నల్లజీలః కును పేరు.

భైరవః-ఇది క్షేత్రపాలకునికిని,శివునికిని పేరగునపుడు ॥ భయంకరమైనదానికి పేరగునపుడు ॥త్రి॥

మాధవః-॥పు॥ ఇది విష్ణువునకును, వసంతర్తువునకును, వైశ మాసమునకును పేరు.

మాధవీ-॥స్త్రీ॥ ఇది బండిగురివిందతీఁగెకును, లక్ష్మికిని, కా కిని పేరు. వసంతకాలసంబంధమైనదానికి పేరగునపుడు 'మ వః, మాధవీ, మాధవమ్' అని ముల్లింగములుం గలవు.

సైన్ధవః-ఇది ఉప్పునకుఁ బేరగునపుడు ॥పు॥ గుఱ్ఱమునః

హాయే నా సిన్ధుజే త్రిషు.

పేరగునపుడు ॥పు॥ సముద్రమునఁబుట్టినదానికి పేరైనపుడు ॥త్రి॥

ఆర్తవం స్త్రీరజః పుష్ప
మృతుసమ్బన్ధిని త్రిషు,

ఆర్తవమ్-ఇది స్త్రీలయొక్క ముట్టునెత్తురునకును, పుష్పమునకు పేరగునపుడు ॥న॥ ఋతుసంబంధమైనదానికి పేరగునపుడు ॥త్రి॥

శత్రుత్వే శాత్రవం నా
ఽరౌ

శాత్రవమ్-ఇది శత్రుభావమునకు పేరగునపుడు ॥న॥ శత్రువునకు పేరగునపుడు ॥పు॥

భార్గవీ స్యాదుమా రమా.
౪౩౧. దూర్వాఽ

భార్గవీ - ॥సీ॥ ఇది పార్వతికిని, లక్ష్మికిని, గరికెకును పేరు.

థ భార్గవః పుంసి రేణు
కాసురశుక్రయోః,

భార్గవః - ॥పు॥ ఇది పరశురామునకును, శుక్రునికిని పేరు.

గాణ్డీవ గాణ్డివౌ పార్థ
చాపే చాపే చ న స్త్రి
యామ్. ౪౩౨

గాండీవః-గాండివః - ॥పు॥ ఈ రెండును అర్జునుని వింటికిని, సామాన్యముగా వింటికిని పేళ్లు.

ప్రగ్రీవ మస్త్రీ గ్రీవా
యాం ప్రసాదేకలశేఽపిచ,

ప్రగ్రీవమ్ - ॥పు॥ ఇది మెడకును, స్వచ్ఛమునకును, కడవకును పేరు.

తపస్వీ తాపసే శోచ్యే

తపస్వీ-॥న్-పు॥ ఇది మునికిని, దీనునికిని పేరు.

ద్విజిహ్వో భుజగే ఖలే.

ద్విజిహ్వః-॥పు॥ ఇది సర్పమునకును, దుర్జనునికిని పేరు.

పార్థివో భూపతౌ భూత్థే

పార్థివః - ॥పు॥ ఇది భూమిని పాలించువానికిని, భూమినిఁ బుట్టినదానికిని పేరు.

క్రమా త్పుంసి త్రిషు
త్రయః,

త్రయః = క్రిందచెప్పిన, తపస్వి - ద్విజిహ్వ - పార్థివశబ్దములు మూఁడును, క్రమాత్=వరుసగా, పుంసి = పుంలింగమునందును, త్రిషు=ముల్లింగములయందును వర్తించును. అనగా మునికిని, పామునకును, భూమినేలు రాజునకును పేరగునపుడు పుంలింగములును, దీనులకును, దుర్జనులకును, భూమినిఁ బుట్టినవానికిని పేరగునపుడు త్రిలింగములనుట.

రాజీవ మబ్జే రాజీవో
మృగే మత్స్యేఽ

రాజీవమ్ - ఇది తామరపుష్పమునకుఁ పేరగునపుడు ॥న॥ మృగవిశేషమునకును, గుంపును వెంటద్రిప్పుకొను మత్స్యభేదమునకును పేరగునపుడు ॥పు॥

థ పల్లవః. ౪౩౪. అస్త్రీ
ప్రవాళే నా షిడ్గే

పల్లవః - ఇది చిగురునకును పేరగునపుడు ॥పు-న॥ విటునికి పేరగునపుడు ॥పు॥

కైతవం ద్యూతదమ్భయోః,
ఇతి వాంతాః.

కైతవమ్ - ॥న॥ ఇది ద్యూతమునకును, డంబమునకును పేరు.

వాంతపదవర్గము ముగిసెను.

రహః ప్రకాశౌ వీకాశౌ
రక్షో వృక్షౌ పలాశినౌ.
నివేశౌ శిబిరోద్వాహౌ
గిరీశౌ శఙ్కరాద్రిపౌ,
ఆదర్శౌ దర్పణేషీకే

నిదేశః కథనాజ్ఞయోః.
నిర్వేశ స్సమ్మూర్ఛనే స్యా
త్కర్మభృత్యుపభోగయోః,

వీకాశః-॥పు॥ఇవి కాంతస్థలమునకును, స్ఫుటమైనదానికిని పేర
పలాశి - ॥న్-పు॥ ఇది రాక్షసునకును, వృక్షమునకును పేర
నివేశః-॥పు॥ఇది దండుదిగిన తావునకును,వివాహమునకుఁ పేర
గిరీశః - ॥పు॥ ఇది శివునికిని, పర్వతశ్రేష్ఠమునకును పేరు.
ఆదర్శః-॥పు॥ ఇది అద్దమునకును, తృణాదులయొక్క దుబ కును పేరు.
నిదేశః-॥పు॥ ఇది చెప్పుటకును, ఆజ్ఞకును పేరు.
నిర్వేశః - ॥పు॥ ఇది అంతట వ్యాపించుటకును, కార్యము కిచ్చు కూలికిని, భోగమునకును పేరు.

ప్రకాశః కిరణే భాసి నా
తుల్యస్ఫుటయో స్త్రిషు.
యమే రక్షసి కీనాశః క
ర్షకే కృపణే త్రిషు,
పత్రే పలాశం హరితే రా
క్షసే కింశుకే పుమాన్.
నిస్త్రింశోఽసౌ త్రిషు
క్రూరే మత్స్యే వా
కులిశం పవౌ,
అథ త్రి ష్వస్వతంత్రాత్మా
వశోఽరిష్టదుష్టధీః.
కర్కశో నిర్దయః క్రూరః
పరస్పర్శశ్చ సాహసీ,
బాలిశౌ మూర్ఖపృథుకౌ
సదృశౌ తు సమోచితౌ.
ఇతి శాంతాః.

ప్రకాశః-ఇది కిరణమునకును, కాంతికిని పేరగునపుడు ॥పు॥ సమానమైనదానికిని, స్ఫుటమైనదానికిని పేరగునపుడు ॥త్రి॥
కీనాశః - ఇది యమునికిని, రాక్షసునకును పేరగునపుడు ॥పు॥ కృషి చేయువానికిని, కృపణునకును పేరగునపుడు ॥త్రి॥
పలాశమ్-ఇది ఆకునకుఁ పేరగునపుడు ॥న॥ పచ్చనీరుల్లికిని రాక్షసునికిని, మోదుగుచెట్టునకును పేరగునపుడు ॥పు॥
నిస్త్రింశః - ఇది ఖడ్గమునకుఁ పేరగునపుడు ॥పు॥ క్రూరునికి పేరగునపుడు ॥త్రి॥ మత్స్యమునకుఁ పేరగునపుడు ॥పు॥
కులిశమ్ - ॥న॥ ఇది వజ్రాయుధమునకుఁ పేరు.
వివశః-॥త్రి॥ ఇది స్వాధీనబుద్ధిలేనివానికిని, ఆసన్నమరణవ చేత దూషితమైన బుద్ధిగలవానికిని పేరు.
కర్కశః-॥త్రి॥ ఇది దయలేనివానికిని, క్రూరునికిని, వేఁడిగ యగు స్పర్శగలదానికిని, సాహసవంతునికిని పేరు.
బాలిశః - ॥త్రి॥ ఇది మూర్ఖునికిని, బాలునికిని పేరు. [పేరు
సదృశః-॥త్రి॥ఇది సమానమైనదానికిని, యోగ్యమైనదానికి

శాంతపదవర్గము ముగిసెను.

---

నిమేష నిమిషౌ సూక్ష్మ
కాలే పక్ష్మణి పావనే,
పురుషో ధాతృపున్నాగ
రాత్మపరమాత్మసు. ౪౪౧

నిమేషః-నిమిషః-॥పు॥ ఈ రెండును, సూక్ష్మకాలభేదమున కును, ఱెప్పకును, పరిశుద్ధమునకును పేర్లు.
పురుషః - ॥పు॥ ఇది బ్రహ్మకును, సురపొన్నచెట్టునకును మనుష్యునికిని, జీవునకును, పరమాత్మకును పేరు.

్యాత ఇన్ద్రియే,
విశేషోఽవయవే వ్యక్తౌ
ుకేఽత్యన్తభేదకే. ౪౪౩
ప్రదోషో దోషరాత్ర్యం

పభీషూ రశ్మిదీధితీ,
సజ్ఘర్షౌ ఘర్షణ స్పర్ధే
శైలూషో బిల్వ నర్తకౌ.
ఆమిషం త్వ స్త్రియాం
ాంస ఉత్కోచే భోగ్య
స్తుని,
దిధిషూ స్త్రీ ద్విరూఢా
రూం తత్పతౌ దిధిషుః
పుమాన్. ౪౪౪
రోహిషం రక్తకతృణే క్లీ
బే మత్స్యే మృగే చ నా,
పౌరుషం విక్రమే భావ
ర్మణోః పురుషస్య చ. ఉ
న్బాహు విస్తృత కరనరమా
నే తు వాచ్యవత్,
పరిచర్యాఽపి శుశ్రూషా

మంజూషా పేటికా పురీ.
నృపాగ్రపత్నీ సైరిభ్యోర్మ
హిషీ
కిల్బిషం త్వఘే, అపరా
ధేఽప్య
థోష్ణీష శ్శిరోవేష్ట కిరీట
యోః. ౪౪౭
నవసూతగవీదుగ్ధే పీయూ
ష మమృతేఽపి చ,
వానా దివ్యవిషే నాఽబ్ధౌ

జూదమునకును, చక్షురాదీంద్రియములకుఁ బేరు.

విశేషః - ॥పు॥ ఇది అవయవమునకును, ప్రకాశమునకును, నుదుటబెట్టు తిలకమునకును, భేదమునకును బేరు.

ప్రదోషః-॥పు॥ఇది దోషమునకును, రాత్రియందొకయంశ మునకును పేరు.

అభీషుః - ॥పు॥ ఇది పగ్గమునకును, కిరణమునకును పేరు.

సంఘర్షః-॥పు॥ ఇది ఒరియుటకును, కలహమునకును పేరు.

శైలూషః-॥పు॥ఇది మారేడుచెట్టునకును, నట్టువవానికిని పేరు.

ఆమిషమ్ - ॥న॥ఇది మాంసమునకును, కానుకకును, భోగ్య వస్తువునకును పేరు.

దిధిషూ - ఇది మాఱుమనుమాడిన స్త్రీకి పేరగునపుడు ॥స్త్రీ॥ ఆస్త్రీని పెండ్లాడిన పురుషునికి పేరగునపుడు-దిధిషుః ॥పు॥

రోహిషమ్ - ఇది ఎఱ్ఱకామంచికసవునకు పేరైనపుడు ॥న॥ ఎఱ్ఱమీనునకును, కొండగొఱ్ఱెకును పేరైనపుడు ॥పు॥

పౌరుషమ్ - ఇది పరాక్రమమునకును, పురుషుని భావమునకును, వాని కార్యమునకును బేరైనపుడు ॥న॥ మనుష్యుఁ చెయ్యెత్తుపొడవునకును పేరైనపుడు విశేష్యలింగము.

శుశ్రూషా - ॥స్త్రీ॥ ఇది శుశ్రూషకును, ఆశబ్దమువలన వి వలయునను నిచ్ఛకును పేరు.

మంజూషా - ॥స్త్రీ॥ ఇది పెట్టెకును, పురమునకును పేరు.

మహిషీ - ॥స్త్రీ॥ ఇది రాజుయొక్క పట్టపుదేవికిని, గే కును పేరు.

కిల్బిషమ్-॥న॥ ఇది పాపమునకును, అపరాధమునకును బేర

ఉష్ణీషః-॥పు॥ ఇది తలకుఁబెట్టెడు పాగా మొదలైనవానికి కిరీటమునకును బేరు.

పీయూషః - ॥న॥ఇది ఈనిన యేడుదినములలోని యా పాలకును, అనఁగా:-జున్నునకును, అమృతమునకును పేరు.

ఆవిషః - ఇది దివ్యవిషమునకు పేరగునపుడు ॥న॥ సము

పవిషో నిర్విషే త్రిషు. ౪౪౮

మునకు పేరగునపుడు ॥పు॥ విషములేని దానికి పేరగునపుడు ॥త్రి॥

గణ్డూషస్తు ద్వయో రాస్యపూతౌ ద్విరద పుష్కరే, ప్రసృతౌ చా

గండూషః - ॥స్త్రీ॥ ఇది పుక్కిటిసీళ్లకును, ఏనుఁగుతొండ గొనకును, చేరకును పేరు.

థ కలుషం క్లీబేఽంహస్యావిలే త్రిషు. ౪౪౯

కలుషమ్ - ఇది పాపమునకు పేరైనపుడు ॥న॥ కలి దానికి పేరైనపుడు ॥త్రి॥

నికష శ్శాణఫలకే నారక్షో మాతరి స్త్రియామ్,

నికషః - ఇది సానఱాతికి పేరగునపుడు ॥పు॥ రాక్షః తల్లికి పేరగునపుడు ॥స్త్రీ॥

నికషాఽవ్యయ మభ్యాశే

నికషా - ఇది సమీపమునకుఁ బేరగునపు డవ్యయము.

కల్మాషః కృష్ణపాణ్డరే. కృష్ణే చ త్రిషు పుంస్యేష దానవే యూపకే గుణే,

కల్మాషః - ఇది చిత్రవర్ణముగల దానికిని, నల్లని దానికి బేరగునపుడు ॥త్రి॥ రాక్షసునకును, అలచందలకును, ఛత్రము నకును బేరగునపుడు ॥పు॥

పరుషో నిష్ఠురే రూక్షే కర్బురే చ త్రిలిఙ్గకః. ౪౫౧

పరుషః - ॥త్రి॥ ఇది కఠినమైనదానికిని, పరుసనిదానికి చిత్రవర్ణముగలదానికిని పేరు.

ఇతి షాన్తాః.

షాంతపదవర్గము ముగిసెను.

---

శ్రీవాసో వృక్షధూపేఽబ్జ

శ్రీవాసః - ॥పు॥ ఇది దేవదారుబంకకును, కమలమునకు మఱియుం విష్ణుదేవునకును బేరు.

రభసో వేగహర్షయోః,

రభసః - ॥పు॥ ఇది వేగమునకును, సంతసమునకును బేరు

నభః ఖే శ్రావణే పుంసి

నభః - ॥న్-స॥ ఇది ఆకాశమునకు పేరు. శ్రావణమాసమునకు పేరగునపుడు-నభాః ॥పు॥

విలాసో భావలీలయోః.

విలాసః-॥పు॥ ఇది శృంగారభావమునకును, లీలలకును పే

వాహసోఽగ్నా వజగరే

వాహసః - ॥పు॥ ఇది అగ్నికిని, కొండచెలగకును బేరు.

భీభత్సో రసపార్థయోః,

భీభత్సః - ॥పు॥ ఇది రసభేదమునకును, అర్జునునకును బే

సాయక క్షేపక ద్రోణ్యామిష్వాసః కార్ముకేఽప్యథ. ౪౫3.

ఇష్వాసః - ॥పు॥ ఇది బాణముంచు దొనకును, వింటికిని బే

ఆఖ్యాయికాపరిచ్ఛేదేఽప్యాశ్వాసో నిర్వృతౌ

ఆశ్వాసః - ॥పు॥ ఇది సత్యమైన యర్థముగల హర్షచరి మొదలైన కృతియొక్క భాగమునకును, ఊరడింపునకుఁ బే

వథ, శ్రేయసీ గజపిప్పల్యా మభయా రాస్నయో రపి. ౪౫౪

శ్రేయసీ - ॥స్త్రీ॥ ఇది గజపిప్పలికిని, కరకవెట్టునకును, సరాస్నకును బేరు.

జుగుప్సా తు ఘృణానిన్దా
చిత్తే సరసి మానసమ్,
సాహసం తు బలాత్కార
కృతకర్మ దమోఽపి తత్.
అలసో నా పాదరోగే
వృక్షే మన్దే త్వయం త్రిషు,
లాలసః ప్రార్థనౌత్సుక్యే
దౌహృదాత్యభిలాషయోః.
పాయసం పరమాన్నే స్యా
చ్ఛ్రీవాసే నాఽ
థ సారసమ్, పద్మేనా తు
ఖగే చన్ద్రే
కీకసం త్వస్థి నా క్రిమౌ.
ఇతి సాన్తాః.

జుగుప్సా - ॥స్త్రీ॥ ఇది దయకును, నిందకును పేరు.
మానసమ్ - ॥న॥ ఇది చిత్తమునకును, సరస్సునకును పేరు.
సాహసమ్ - ॥న॥ ఇది బలాత్కారమునఁ జేసిన కార్యమునకును, దండమునకును పేరు.
అలసః - ఇది పాదరోగమునకును, వృక్షమునకును పేరగునపుడు ॥పు॥ మందునికిఁ బేరగునపుడు ॥త్రి॥
లాలసః-॥ప్న॥ ఇది వేఁడుకొనుటకును, ఇష్టవస్తువెపుడుకలుగునను ననురాగవిశేషమునకును, వేవిళ్లకును, అత్యాశకును పేరు.
పాయసమ్ - ఇది పరమాన్నమునకుఁ బేరగునపుడు ॥న॥ దేవదారుబంకకుఁ బేరగునపుడు ॥పు॥
సారసమ్ - ఇది పద్మమునకుఁ బేరగునపుడు ॥న॥ బెగ్గురుపక్షికిని, చంద్రునికిని బేరగునపుడు ॥పు॥
కీకసమ్ - ఇది ఎముకకుఁ బేరైనపుడు ॥న॥ పురుగునకుఁ బేరైనపుడు ॥పు

సాంతపదవర్గము ముగిసెను.

---

నివహో వాయుభేదేఽపి
కలహో ద్వన్ద్వయుద్ధయోః,
నిర్యూహ శ్శేఖరే ద్వారే
నిర్యాసే నాగదన్తకే. రగిర
క్వాథే రసేఽ
థ దాత్యూహ శ్చాతకే
కాలకణ్ఠకే,
ప్రవాహః పాథసాం వేగే
ప్రకృష్టాశ్వే ప్రవర్తనే.
ప్రవహ స్స్యా ద్వాయు
భేదే వాయుమాత్రే బహి
ర్గతౌ,
స్వీకారోచ్ఛ్రాయసంక్షేప
మహోద్యోగేషు సఙ్గ్రహః.
ఆగ్రహోఽనుగ్రహే సక్తి
నిర్బన్ధగ్రహణేష్వ

నివహః - ॥పు॥ ఇది వాయుభేదమునకును, అపిశబ్దమువలన గుంపునకును పేరు.
కలహః - ఇది మిథునమునకును, యుద్ధమునకును పేరు.
నిర్యూహః - ॥పు॥ ఇది సిగనుజుట్టిన పూలదండకును, ద్వారమునకును, బంకకును, కొణిగెకు నాధారముగా గోడయందు నాటిన కొయ్యకును, కషాయమునకును, గంధమునకును పేరు.
దాత్యూహః-॥పు॥ ఇది చాతకపక్షికిని, భరతపక్షికిని పేర
ప్రవాహః - ॥పు॥ ఇది ఉదకవేగమునకును, శ్రేష్ఠాశ్వమునకును, ప్రవర్తించుటకును పేరు.
ప్రవహః - ॥పు॥ ఇది వాయువిశేషమునకును, వాయుమాత్రమునకును, బయలువెడలుటకును పేరు.
సంగ్రహః - ॥పు॥ ఇది గ్రహించుటకును, పర్వతాదపొడవునకును, సంక్షేపమునకును, అతిప్రయత్నమునకును పే..
ఆగ్రహః - ॥పు॥ ఇది అనుగ్రహమునకును, ఆసక్తి నిర్బంధమునకును, గ్రహించుటకును పేరు.

హ, క్రోడ్యా మారోహణే దైర్ఘ్యే సముచ్ఛ్రయే నిషాదిని. ౮౬౧ ఆరోహ స్స్యాత్

కటాహస్తు హర్మ్యస్స్యా ష్టేచ కర్పరే, తైలాది పాక పాత్రే౽థ నిగ్రహస్సీమ్ని భర్త్సనే. ౮౬౨.

పరాహ స్సూకరే విష్ణౌ నాణకే శైల ముస్తయోః,

తులా సూత్రే౽శ్వాదిరశ్మౌ ప్రగ్రాహ ప్రగ్రహౌ పుభౌ.

విగ్రహ స్సఙ్గరే దేహే విస్తరే౽ప్య

థ నిర్దహః, భేద్యవ త్పర దోషోక్తిపరే నిష్ఠురభాషిణి.

సువహా సల్లకీ గోధాపదీ శేఫాలికాసు చ,

వైదేహీ స్యాద్వణిగ్యోషి త్పిప్పలీ జనకాత్మజా. ౮౬౪

ఇతి హాన్తాః.

ఆరోహః-॥పు॥ ఇది స్త్రీలయొక్క పిఱుఁదునకును, ఎక్కుటకును, దీర్ఘభావమునకును, పర్వతాదుల పొడవునకును, మావటి వానికిని పేరు.

కటాహః - ఇది మేడయొక్క పై చదరమునకును, తొట్టికిని, తైలాదులఁ గాచు పాత్రకును పేరు.

నిగ్రహః - ॥పు॥ ఇది మర్యాదకును, బెదరించుటకును పేరు.

వరాహః - ॥పు॥ ఇది అడవిపందికిని, విష్ణువునకును, వరహాకును, పర్వతమునకును, తుంగముస్తలకును పేరు.

ప్రగ్రాహః-ప్రగ్రహః-॥పు॥ ఈరెండును త్రాసుకోల మొదలైనవానిత్రాటికిని,గుఱ్ఱము మొదలైనవానికట్టు పగ్గమునకుఁ బేళ్లు.

విగ్రహః- ॥పు॥ ఇది యుద్ధమునకును, దేహమునకును, శబ్దముల విరివికిని పేరు.

నిర్దహః - ఇది పరులదోషములఁ జెప్ప నిచ్ఛగలవానికిని, కఠినోక్తులఁ జెప్పువానికిని పేరైనపుడు ॥విశేష్యలింగము॥

సువహా - ॥స్త్రీ॥ ఇది చిల్లచెట్టునకును, చెప్పుతట్టయాకునకును, నల్లపువ్వుల వావిలిచెట్టునకును పేరు.

వైదేహీ - ॥స్త్రీ॥ ఇది వర్తకునిభార్యకును, పిప్పలికిని, సీతకును నామము.

హాంతపదవర్గము ముగిసెను.

---

ప్రత్యక్షే౽ధికృతే౽ధ్యక్ష స్త్రి

ష్వారక్ష స్తు రక్షణే, అథ శ్చ దన్తికుమ్భస్య

హర్యక్షశ్శ్రీదసింహయోః.

రక్తాక్షో మహిషే దైత్యే పారావత చకోరయోః,

గోతుంబాయాం గవాక్షీ స్త్రీ

గవాక్షో జాలకే పుమాన్.

ఇతి క్షాన్తాః.

అధ్యక్షః - ॥త్రి॥ ఇది ప్రత్యక్షమునకును, అధికారముగలవానికిని పేరు.

ఆరక్షః - ॥పు॥ ఇది రక్షించుటకును, ఏనుఁగు కుంభస్థలము యొక్క దిగువకును పేరు.

హర్యక్షః - ॥పు॥ ఇది కుబేరునకును, సింహమునకును పేరు

రక్తాక్షః - ॥పు॥ ఇది మహిషమునకును, దైత్యునకును, పావురమునకును, చకోరపక్షికిని పేరు.

గవాక్షీ - ॥స్త్రీ॥ బుడమతీఁగెకుఁ బేరు.

గవాక్షః - ॥పు॥ ఇది సూరణగంతకు పేరు.

క్షాంతపదవర్గము ముగిసెను.

శ్లో. ఇతి జగదుపకారిణ్యా మిరుగపదణ్డాధినాథరచితాయామ్,
త్ర్యక్షరపదకాణ్డోఽయం పూర్ణో నానార్థరత్నమాలాయామ్. ౨౬౨

టీక. జగదుపకారిణ్యామ్ - జగత్ = లోకమునకు, ఉపకారిణ్యామ్ = ఉపకారకమైనదియు, ఇరుగపదణ్డాధినాథరచితాయామ్ - ఇరుగపదణ్డాధినాథ = ఇరుగపదండనాథుని చేత, రచితాయామ్=చేయఁబడినదియునగు, నానార్థరత్నమాలాయామ్ = నానార్థరత్నమాలయను గ్రంథమునందు, అయమ్ = ఈ, త్ర్యక్షరపదకాణ్డః - త్ర్యక్షర = మూఁడక్షరములుగల, పద = శబ్దములయొక్క, కాణ్డః = సమూహము, ఇతి = ఈ పూర్వోక్తప్రకారముగా, పూర్ణః = ముగిసెను.

త్ర్యక్షర కాండము

సంపూర్ణము.



# చతురక్షరకాండము.



పిక భృఙ్గౌ వళిపికౌ
పిక భేకౌ వలాసకౌ,
భృఙ్గాలకౌ భ్రమరకౌ
శ్రీవత్సాఙ్కౌ వృషాచ్యు
తౌ. ౧
ఆఖుక్రోడా వాఖనకౌ గిరి
మేఘౌ వలాహకౌ,
కర్కోటకౌ బిల్వసర్పౌ
దన్దశూకోఽహి రక్షసోః.
స్థూలరజ్జౌ బీజకోశే వరా
టే చ వరాటకః,
భట్టారకో భూమిపాలే
దివౌకసి తపోధనే. ౩
అఙ్గారక స్తూల్ముకస్య ఖణ్డే
భౌమే కురణ్టకే,
సాలావృక స్సారమేయే
వృకే క్రోష్టరి మర్కటే. ౪
వినాయక స్తు సుగతే గరు
త్మతి గణాధిపే,
హారభేదే మాణవకో బా
లే కుపురుషే చ సః. ౫
పుణ్డరీకం సితచ్ఛత్రే కుష్ఠ
భేదే సితామ్బుజే, నా త్వా
మ్రే రజతే వ్యాఘ్రే దిగ్గజే
కుఞ్జరే స్వరే. ౬
నియామకః పోతవాహే నా
నియన్తరి తు త్రిషు,
భయానక స్తు శార్దూలే

అళిపికః - ॥పు॥ ఇది కోకిలకును, తుమ్మెదకును పేరు.

వలాసకః- ॥పు॥ ఇది కోకిలకును, కప్పకును పేరు.

భ్రమరకః- ॥పు॥ ఇది తుమ్మెదకును, ముంగురులకును పేర

శ్రీవత్సాంకః - ॥పు॥ ఇది వృషభమునకును, విష్ణువునకు పేరు.

ఆఖనకః-॥పు॥ ఇది పందికొక్కునకును, అడవిపందికిని పేర

వలాహకః-॥పు॥ ఇది పర్వతమునకును, మేఘమునకును పేర

కర్కోటకః-॥పు॥ఇది బిల్వవృక్షమునకును, సర్పమునకును పేర

దందశూకః - ॥పు॥ ఇది సర్పమునకును, రాక్షసునికిని పేర

వరాటకః - ॥పు॥ ఇది లావైనత్రాటికిని, తామరకాయకున గవ్వకును పేరు.

భట్టారకః-॥పు॥ ఇది భూమిని బాలించు రాజునకును, దేవ కును, తపస్వికిని పేరు.

అంగారకః - ॥పు॥ ఇది కొఱవితునుకకును, అంగారకునకు పచ్చపువ్వుల గోరింటకును పేరు.

సాలావృకః - ॥పు॥ ఇది రేఁజుక్కకును, తోఁడేటికి నక్కకును, కోఁతికిని పేరు.

వినాయకః - ॥పు॥ ఇది బుద్ధదేవునికిని, గరుత్మంతునకు గణపతికిని పేరు.

మాణవకః - ॥పు॥ ఇది ఇరువదిసరముల ముత్యాలహారము కును, బాలునకును, కుత్సితపురుషునికిని పేరు.

పుండరీకం-ఇది తెల్లగొడుగునకును, తెల్లపులుమునకును, తె తామరపువ్వునకును పేరగునపుడు ॥న॥ మామిడిచెట్టునకును, వెం కిని, పెద్దపులికిని, ఆగ్నేయభాగమునసున్న దిగ్గజమునకును, మాన్యమైనయేనుఁగునకును, స్వరభేదమునకును బేరగునపుడు॥పు॥

నియామకః - ఇది ఓడకంబముమీఁదనుండి యుపాయ చెప్పువానికి పేరైనపుడు ॥పు॥ నియామకునకు పేరైనపుడు ॥త్రి॥

భయానకః - ఇది పెద్దపులికిని, రాహువునకును పేరైనపు

...హసా నా భీషణే త్రిషు.
పుమాన్ బృన్దారకో దేవే
త్రిషు శ్రేష్ఠమనోజ్ఞయోః,
కాలేయక స్స్వరమేయే
రా కులీసే తు వాచ్యవత్.
వక్త్రయో మయూరసరట
సకుక్కుటాః కృకవాకవః.
స్యాత్సోమవల్కః ధవళ
ఖదిరే కట్ఫలేఽపి చ.
పాఞ్చాలికా పుత్త్రికా
యాం ద్రౌపదీరీతిభేదయోః,
కనీనికాఽక్షితారాయాం
స్యాత్కనిష్ఠాంగుళావపి.
వాద్యానాం లగుడే వా
ద్యభేదే ఘర్ఘరికా భవేత్.
జీవన్తికా తు జీవాయాం
గుడూచీవన్దయో రపి. ౧౧
ఉత్కణ్ఠాయా ముత్కలి
కా సైవ హేలా తరఙ్గ
యోః,
కోశాతకీజ్యోత్స్నికాయా
మపామార్గే చ సా భవేత్.
సౌగన్ధికం తు కహ్లారే ప
ద్మరాగే చ కత్తృణే,

రక్తర్థికం సుఖే స్థానే
దివసే మఙ్గళేఽప్య
థ. ౧౩. త్రిఫలాయాం
త్రికటుకే త్రిగన్ధే చ త్రివ
ర్ణకమ్,
స్తనవృన్తే పిప్పలక మపి
సేవనసూత్రకే. ౧౪

॥పు॥ భయంకరమైనదానికి పేరైనపుడు ॥త్రి॥

బృందారకః-ఇది దేవతకు పేరైనపుడు ॥పు॥ శ్రేష్ఠునికిని, ఒప్పిదమైనదానికిని పేరైనపుడు ॥త్రి॥

కాలేయకః-ఇది కుక్కకు పేరైనపుడు ॥పు॥ కులశ్రేష్ఠునికి పేరైనపుడు విశేష్యలింగము.

కృకవాకుః - ॥పు॥ ఇది నెమలికిని, ఊసరవెల్లికిని, కోడికిని పేరు.

సోమవల్కః - ॥పు॥ ఇది తెల్లచంద్రచెట్టునకును, గుమ్మడి చెట్టునకును పేరు.

పాంచాలికా॥స్త్రీ॥ ఇది పుత్తలికకును, ద్రౌపదికిని, రీతి విశేషమునకును పేరు.

కనీనికా - ॥స్త్రీ॥ ఇది కంటినల్లగుడ్డునకును, చిటికెనవ్రేలి కిని బేరు.

ఘర్ఘరికా-॥స్త్రీ॥ ఇది వాద్యములవాయించుకోలకును, వాద్య భేదమునకును బేరు.

జీవంతికా -॥స్త్రీ॥ ఇది పాలకూరకును, తిప్పతీఁగెకును, బద నికకును పేరు.

ఉత్కలికా - ॥స్త్రీ॥ ఇష్టవస్తుప్రాప్తియందలి కాలవిళంబము నోర్వఁజాలక తహతహపడుటకును, విలాసమునకును, అలకును పేరు.

కోశాతకీ - ॥స్త్రీ॥ ఇది పొట్లచెట్టునకును, ఉత్తరేణికిని పేరు. చకారమువలన అవడచెట్టునకును పేరు.

సౌగంధికమ్ ॥న॥ ఇది ఇంచుకయెఱుపును మిక్కిలి పరిమ ళమును గలకలువకును, పద్మరాగమణికిని, కామంచికసవునకును పేరు. చకారమువలన సుగంధముగలదానికిఁ బేరైనపుడు ॥త్రి॥

రక్తర్థికమ్-॥న॥ ఇది సుఖమునకును, స్థానమునకును, పగటి కిని, శుభమునకును పేరు.

త్రివర్ణకమ్-॥న॥ ఇది కరక తాడి ఉసిరికాయలకును, శొ... ఠి పిప్పలి మిరియాలకును, కస్తూరి గోరోచన కుంకుమపువ్వు... కును పేరు.

పిప్పలకమ్-॥న॥ ఇది స్త్రీస్తనాగ్రమునకును, కుట్టుడుదారమ నకును పేరు.

తిన్త్రిణీకం ఫాదపామ్లే
చింతాయామ ప్య
థాస్త్రియాం, విశేషకం
స్యాత్తిలకే విశేషాదాయ
కే త్రిషు. ౧౫

శూద్రా ద్వైదేహకో వై
శ్యాసుతే నా వణిజి త్రిషు,
మయూరక స్త్వపామా
ర్గే పుమాన్ క్లీబే తు తుత్థకే
సుప్రతీకో భేద్యలిఙ్గ శ్శు
భాఙ్గే దిగ్గజే పుమాన్,
పలమానే షోడశికా స
దా న స్త్రీ పలద్వయే. ౧౬
జైవాతృకః కర్షకేన్ద్వోర్వై
ద్యే నా౽౽యుష్మతి త్రిషు,
త్రిషు వృద్ధే శతానీకో.
మునౌ పుంస్య
థ వాచ్యవత్. ౧౭. కా
ర్యాక్షమః ప్రభోర్భావవ
ర్జీ లాలాటికా వుభౌ.
అదూరేరితదృగ్దమ్భయు
క్తః కౌక్కుటికా వుభౌ.
ఇతి కాన్తాః.

తింత్రిణీకమ్-॥న॥ ఇది చింతపండునకును, చింతకును పే

విశేషకమ్-ఇది నుదుటంబెట్టుబొట్టునకుఁ బేరైనపుడు
విశేషాదాయముగలదానికి పేరైనపుడు ॥త్రి॥

వైదేహకః-ఇది శూద్రునివలనఁ గోమటిస్త్రీకిఁబుట్టిన
పేరగునపుడు ॥పు॥ వర్తకునికి పేరగునపుడు॥త్రి॥

మయూరకః - ఇది ఉత్తరేణిచెట్టునకు పేరగునపుడు
మైలతుత్తమునకు పేరగునపుడు ॥న॥

సుప్రతీకః-ఇది అందమైనమేనుగలవానికి పేరైనపు
ష్యలింగము॥ ఈశాన్యదిశనున్న దిగ్గజమునకు బేరగునపుడు

షోడశికా-ఇది ఒకపలమెత్తునకు పేరగునపుడు ॥స్త్రీ
డుపలములయెత్తునకు పేరగునపుడు ॥న॥

జైవాతృకః-ఇది దున్నువానికిని, చంద్రునికిని, వైద
పేరగునపుడు ॥పు॥ ఆయుష్మంతునికిని పేరగునపుడు ॥త్రి

శతానీకః-ఇది వృద్ధునికి పేరగునపుడు ॥త్రి॥ మునికి
నపుడు ॥పు॥

లాలాటికః-ఇది కార్యమును జేయ శక్తిలేనివానికిని, ప్ర
యొక్క భావమును దెలిసికొనువానికిని పేరగునపుడు ॥
లింగము.

కౌక్కుటికః - ఇది సమీపమును చూచుచుంబోవు వ
దంభముగలవానికిని పేరు.

కాంతపదవర్గము ముగిసెను.

---

గజకూర్మౌ పఞ్చనఖౌ
భృఙ్గబాణౌ శిలీముఖౌ,
మహాశఙ్ఖో నిధౌ స
ఙ్ఖ్యాప్రభేదే మానుషాస్థిని.
ద్విజదేవా వగ్నిముఖౌ భ
ల్లాతేఽగ్నిముఖీ స్త్రియాం,
విశాల్యా లాఙ్గలీ చాగ్ని
శిఖా క్లీబే తు కుఙ్కుమే.
ఇతి ఖాన్తాః.

పంచనఖః-॥పు॥ ఇది ఏనుఁగునకును, తాఁబేటికిని పే
శిలీముఖః-॥పు॥ ఇది తుమ్మెదకును, అమ్ములకును పేరు
మహాశంఖః-॥పు॥ ఇది నిధికిని, సంఖ్యావిశేషమునకున
ష్యుల నొసటియెముకకును, మఱియుం శంఖమునకును పే

అగ్నిముఖః-॥పు॥ ఇది దేవతలకును, బ్రాహ్మణులకు
గునపుడు ॥పు॥ జీడిమ్రానికి పేరగునపుడు, అగ్నిముఖీ ॥స్త్రీ

అగ్నిశిఖా - ఇది వెన్నెదురుకూరకును, తరిగో
నకును పేరగునపుడు ॥స్త్రీ॥ కుంకుమకు పేరగునపుడు ॥న॥

ఖాంతపదవర్గము ముగిసెను.

అపవర్గః క్రియాముక్త్యోః క్రియాసాధ్యఫలాగమే,

అపవర్గః - ॥పు॥ ఇది క్రియకును, ముక్తికిని, క్రియాసాధ్యమైన ఫలప్రాప్తికిని పేరు.

ఉపరాగః పరీవాదే సోమసూర్యగ్రహేఽపి చ.

ఉపరాగః - ॥పు॥ ఇది అపవాదమునకును, చంద్రసూర్యగ్రహణములకును పేరు.

శాపాక్రోశ తిరస్కారే ష్వభిషఙ్గో

అభిషంగః-॥పు॥ ఇది శాపమునకును, తిట్టుటకును, తిరస్కారమునకును పేరు.

ఽథ రూపకే, వృకేఽపీహామృగ స్స్యాత్తు

ఈహామృగః ॥పు॥ ఇది నాటకభేదమునకును, తోఁడేటికిని పేరు.

సంప్రయోగః కృతేఽన్వయే

సంప్రయోగః-॥పు॥ఇది క్రియకును, అన్వయమునకును పేరు.

ఇతి గాంతాః

గాంతపదవర్గము ముగిసెను.

---

మలిమ్లుచో వాయుంచోరౌ

మలిమ్లుచః - ॥పు॥ ఇది వాయువునకును, దొంగకును పేరు.

ఇతి చాంతాః.

చాంతపదవర్గము ముగిసెను.

---

గ్రహరాజోఽర్క చన్ద్రయోః,

గ్రహరాజః - ॥పు॥ ఇది సూర్యునికిని, చంద్రునికిని పేరు.

భరద్వాజో మునౌ ద్రోణే వ్యాఘ్రాటేఽ

భరద్వాజః - ॥పు॥ ఇది భరద్వాజమునికిని, ద్రోణాచార్యునకును, ఏట్రింతకును పేరు.

ఽథ యుధిష్ఠిరే. ౨౮. యమే బుద్ధే ధర్మరాజోఽ

ధర్మరాజః - ॥పు॥ ఇది యుధిష్ఠిరునకును, యమునికిని, బుద్ధదేవునికిని పేరు.

నుజశూద్రౌ జఘన్యజౌ,

జఘన్యజః - ॥పు॥ ఇది తమ్మునికిని, శూద్రునికిని పేరు.

రాజరాజః కుబేరేఽపి

రాజరాజః - ॥పు॥ ఇది కుబేరునకును, అపిశబ్దమువలన సార్వభౌమునకును పేరు.

ద్విజరాజః ఖగేశ్వరే. ౨౯. చన్ద్రేఽపి

ద్విజరాజః - ॥పు॥ గరుత్మంతునకును, చంద్రునకును, అపిశబ్దమువలన బ్రాహ్మణశ్రేష్ఠునకును పేరు.

భృఙ్గరాజ స్స్యా ద్భృఙ్గధూమ్యాటమార్కవాః,

భృంగరాజః - ॥పు॥ ఇది తుమ్మెదకును, కూఁకటిమూఁగకును, పక్షికిని, గుంటగలగరకును పేరు.

ఇతి జాంతాః.

జాంతపదవర్గము ముగిసెను.

---

ప్రత్యాఖ్యాతే ప్రేషితే చ ప్రతిసృష్ట స్త్రిలిఙ్గకః. ౩౦.

ప్రతిసృష్టః - ॥త్రి॥ ఇది తిరస్కరింపఁబడినవానికిని, పంపఁబడినవానికిని పేరు.

శిపివిష్టో మహాదేవే ఖలతౌ

శిపివిష్టః-॥పు॥ ఇది ఈశ్వరునికిని, బట్టతలవానికిని, కుష్ఠరోగ

దుష్టచర్మణి,

పువానికిని పేరు.

కరహాటః పద్మకన్దే పు
ష్పభేదే ద్రుమాన్తరే. ౨౭

కరహాటః - ॥పు॥ ఇది తామరదుంపకును, పుష్పము వృక్షభేదమునకును పేరు.

ఖఞ్జరీటః ఖఞ్జనే స్యా
దసిధారావ్రతస్థితే,

ఖంజరీటః - ॥పు॥ ఇది కాటుకపిట్టకును, కత్తివాడయుగ్రవ్రతశీలునకును పేరు.

బలిపుష్టౌ బకధ్వాంక్షౌ

బలిపుష్టః - ॥పు॥ ఇది కొంగకును, కాకికిని పేరు.

ఇతి టాన్తాః.

టాంతపదవర్గము ముగిసెను.

---

కలకణ్ఠ స్తు కోకిలే. ౨౮
హంసే పారావతే చాపి
త్రిషు త్వేష కలస్వరే,

కలకంఠః-ఇది కోకిలకును, హంసకును, పావురమునకును పేరగునపుడు ॥పు॥ ఇంపైన కంఠధ్వనిగలవానికి పేరగునపుడు

స్యా జ్జమ్బీరే కపిత్థే చ
రసే దన్తశఠః పుమాన్.
ఆమ్లే త్రి ష్వామ్లలోణ్యాం
స్త్రీ

దంతశఠః - ఇది నిమ్మచెట్టునకును, వెలగచెట్టునకును పుల్లనైనదానికి పేరగునపుడు ॥పు॥ పులుసునకును పేరగునపుడు ॥త్రి॥ పులిచింతకు పేరగునపుడు ॥స్త్రీ॥

నీలకంఠౌ శిఖీశ్వరౌ,

నీలకంఠః - ॥పు॥ ఇది నెమలికిని, శివునికిని పేరు.

ఇతి ఠాంతాః.

ఠాంతపదవర్గము ముగిసెను.

---

సమారూఢా త్యధికయో
రత్యారూఢ స్త్రీలిఙ్గకః.

అత్యారూఢః-॥త్రి॥ ఇది ఎక్కినదానికిని, మిక్కుటమైనవానికిని పేరు.

ఇతి ఢాంతాః.

ఢాంతపదవర్గము ముగిసెను.

---

కౌస్తుభేఽశ్వగళావర్తే శివే
దేవమణిః పుమాన్,

దేవమణిః ॥పు॥ ఇది కౌస్తుభమణికిని, గుఱ్ఱము మెడసుడికిని, శివునికిని పేరు.

శఙ్కుకర్ణో గర్దభే స్యా
దుష్ట్రేఽప్య

శంకుకర్ణః - ॥పు॥ ఇది గాడిదెకును, ఒంటెకును, అపి చేత నొకరాక్షసునకును పేరు.

థ సమీరణః. ౩౧. ఫణి
ర్జకే మారుతే స్యా

సమీరణః - ॥పు॥ ఇది మరువమునకును, గాలికిని పే

దథ నీలీవిశల్యయోః, మధు
పర్ణీ

మధుపర్ణీ-॥స్త్రీ॥ఇది నీలిచెట్టునకును, వెన్నవెదురుకూరకున

సాలపర్ణీ స్థిరాయాం శ్వేత
చన్దనే. ౩౮

సాలపర్ణీ - ॥స్త్రీ॥ ఇది ముయ్యాకుపొన్నకును, తెల్లగంధమునకును పేరు.

దాక్షాయణీ భవానీ భూ
రశ్విన్యాద్యాశ్చ తారకాః,
అసమ్బాధచమూగత్యాం
సంసారే పురనిర్గమే. 33
ఘణ్టాపథే సంసరణ
మథోద్ధరణ ముద్ధృతౌ,
భుక్తోజ్ఝితే నిస్సరణ ము
పాయే నిర్గమేఽపి చ. 3౪
పారాయణం పారగతా
వంకుశస్య చ బన్ధనే,
శబ్దశాస్త్రే వ్యాకరణం జ్యా
టంకారే స్ఫుటీకృతౌ. 3౫
స్యాదస్త్రీయాం వారవా
ణం కూర్పాసే కవచేఽపి చ,
నారాయణీ రమాగౌర్యో
శ్శతావర్యాం హరౌ తు నా.
నిరూపణం తు న పుమాన్
విలోచనవికారయోః,
పరాయణం క్లీబ మిష్టాశ్ర
యయో స్తత్పరే త్రిషు.
కార్త్స్న్యేఽప్య
థో కామ్యదానే నిషేధే
చ ప్రదారణమ్,
విదారణం స్యా త్సమరే
ద్వైధీభావే విడమ్బనే. 3౬
ఇతి ణాన్తాః.

దాక్షాయణీ - ॥స్త్రీ॥ ఇది శివునిభార్యకును, భూమికిని, అశ్విని మొదలైన యిరువదియేడునక్షత్రములకును పేరు.

సంసరణమ్-॥న॥ ఇది సంకటములేనట్టులు సేన నడచుటకును సంసారమునకును, పట్టణము వెడలుటకును, పదియిండ్లపట్టుగల రాజమార్గమునకును బేరు.

ఉద్ధరణమ్-॥న॥ ఇది ఎత్తుటకు పేరు.

నిస్సరణమ్-॥న॥ ఇది అనుభవించి విడిచినదానికిని, ఉపాయమునకును, బయలువెడలుటకును బేరు.

పారాయణమ్-॥న॥ ఇది తుదను పొందుటకును, అంకుశము జారకుండునట్టులు కట్టు త్రాటికిని పేరు.

వ్యాకరణమ్-॥న॥ ఇది శబ్దశాస్త్రమునకును, నారిమ్రోతకును, ప్రకాశపఱచుటకును బేరు.

వారవాణమ్-॥పున॥ ఇది రవికెకును, జోడునకును పేరు.

నారాయణీ-॥స్త్రీ॥ ఇది లక్ష్మికిని, గౌరికిని, చల్లగడ్డకును బేరు. విష్ణువునకు పేరైనపుడు నారాయణః ॥పు॥

నిరూపణమ్-॥పున॥ ఇది నేత్రమునకును, వికారమునకును బేరు.

పరాయణమ్-ఇది యిష్టమునకును, ఆశ్రయమునకును పేరైనపుడు॥న॥ ఒకయర్థమునందుఁ దగిలిన మనస్సుగలవానికిని, అంతయు ననునర్థమునకును పేరైనపుడు ॥త్రి॥

ప్రదారణమ్-॥న॥ ఇది యాచకుఁడు కోరినవస్తువును తానొక్క ఫలము నపేక్షించి యిచ్చుటకును, నిషేధమునకును బేరు.

విదారణమ్-॥న॥ ఇది యుద్ధమునకును, పగుల్చుటకును, అనుకరించుటకును పేరు.

ణాంతపదవర్గము ముగిసెను.

---

ఉదాస్థిత శ్చరే ద్వాఃస్థే
సమాఘాతో వధే రణే,
పరివర్తో వినిమయే స్యా
త్కల్పాన్తే పరిభ్రమే. 3౭
నన్ద్యావర్తస్తు భవనభేదే

ఉదాస్థితః-॥పు॥ఇది వేగులవానికిని,ద్వారపాలకునకును బేరు.

సమాఘాతః-॥పు॥ ఇది వధకును, యుద్ధమునకును పేరు.

పరివర్తః- ॥పు॥ ఇది ఒక వస్తువు నిచ్చి మఱియొకవస్తువును మార్చుటకును, ప్రళయకాలమునకును, తిరుగుటకును బేరు.

నన్ద్యావర్తః-॥పు॥ ఇది రచనాభేదమువలనఁ జేయఁబడిన

తగరపాదపే,
నాగదన్తో ద్విపరదే గృహ
నిర్గమదారుణి. ౪౦
నదీకాన్తస్తు నిచులే సిన్ధు
వారసముద్రయోః,
త్వష్టృరాజాగ్ని జామాతృ
బ్రహ్మార్కేషు ప్రజాపతిః.
అపుష్పఫలవద్వృక్షే వృక్ష
మాత్రే వనస్పతిః,
అపి శమ్భౌ పశుపతి
రపి లక్ష్మీపతిర్నృపే. ౪౧

అపి శ్రీదే ధనపతి
రపి సేనాపతిర్గుహే,

ఉత్పాతేఽగ్నౌ ధూమకేతు
ర్విశ్వగోప్తాహరీన్ద్రయోః.
చోరోలూకౌ దివాభీతౌ
వాసంత్యాం తినిశద్రుమే,
అతిముక్తః
పారిజాతౌ పారిభద్ర సుర
ద్రుమౌ. ౪౪
స్త్రియా మపచితిః పూజా
నిష్కృత్యో స్సంక్షయేఽ
వ్యయే,
అథ హైమవతీ గఙ్గా
పథ్యా శుక్లవచాఽప్యుమా.
ప్రతిమాయాం ప్రతికృతిః
పూజన ప్రతికారయోః,
ప్రత్యాప్తి ర్గౌరవం బుద్ధిః
ప్రాగల్భ్యం ప్రతిపత్తయః.
అనుజ్ఞా స్యా దనుమతిః

రాజగృహావిశేషమునకును, నందివర్ధనపుచెట్టునకును పేరు.

నాగదన్తః-॥పు॥ ఇది ఏనుఁగుదంతమునకును, గృహద్వా
సాధనమైన దారుభేదమునకును పేరు.

నదీకాన్తః-॥పు॥ ఇది పనసచెట్టునకును, వావిలిచెట్టునకును
సముద్రమునకును పేరు.

ప్రజాపతిః-॥పు॥ ఇది వడ్లవానికిని, రాజునకును, అగ్నికిని
అల్లునికిని, బ్రహ్మకును, సూర్యునికిని పేరు.

వనస్పతిః- ॥పు॥ ఇది పుష్పఫలములు లేనివృక్షమునకును
వృక్షసామాన్యమునకును పేరు. [రికిని పేరు

పశుపతిః-॥పు॥ ఇది శివునికిని, అపిశబ్దముచేత పశువుల మే

లక్ష్మీపతిః-॥పు॥ ఇది రాజునకును, అపిశబ్దముచేత విష్ణువు
కును పేరు. [పేరు

ధనపతిః-॥పు॥ ఇది కుబేరునకును, అపిశబ్దముచేత ధనికునకు

సేనాపతిః-॥పు॥ ఇది కుమారస్వామికిని, అపిశబ్దముచేత సేన
నాయకునకును పేరు.

ధూమకేతుః-॥పు॥ ఇది ఉత్పాతమునకును, అగ్నికిని పేరు

విశ్వగోప్తా-॥ఋ-పు॥ ఇది విష్ణువునకును, ఇంద్రునకును పేరు

దివాభీతః-॥పు॥ ఇది చోరునకును, గుడ్లగూబకును పేరు.

అతిముక్తః-॥పు॥ఇది బండిగురివిందకును, నెమ్మిచెట్టునకును పేరు

పారిజాతః-॥పు॥ ఇది పారిజాతవృక్షమునకును, కల్పవృక్షమున
నకును పేరు.

అపచితిః-॥స్త్రీ॥ ఇది పూజకును, ప్రాయశ్చిత్తమునకును,
యించుటకును, వ్యయమునకును పేరు.

హైమవతీ- ॥స్త్రీ॥ ఇది గంగకును, ఉసిరికచెట్టునకును, తె
వసకును, పార్వతికిని పేరు.

ప్రతికృతిః-॥స్త్రీ॥ ఇది ప్రతిమకును, పూజించుటకును, ప్ర
క్రియచేయుటకును పేరు.

ప్రతిపత్తిః-॥స్త్రీ॥ ఇది పోయినదాని మరలఁ బొందుటకును
గౌరవమునకును, బుద్ధికిని, ప్రౌఢమకును పేరు.

అనుమతిః-॥స్త్రీ॥ ఇది అనుజ్ఞకును, ఒకకళ తక్కువైనచంద్రు

కీన్దుపూర్ణిమా,
మ్భ్యం శతావర్యా
స్త్రీకా౽
షణే. ౭౭. ప్రార్థనే
స్సా స్యా
ప్రాన్తా దురాలభా,
ప్రాంతా తు పాటలా
ఽప్యథ. ౪౮
ద్యూతం యుద్ధమాత్రే
ద్ధేఽపి తద్భవేత్,
హితం త్వతిభయం
నపేక్షి చ. ౪౯
హితో౽గ్న్యుత్పా
త్రిషూపనివేశితే,
వతో౽భ్రమా తజ్జే
నాగరజ్జకే. ౫౦.
ర్ఘేన్ద్రచాపే తు క్లీబ
వతీ తటిత్,
తం రూప్యహే
క్లీబం త్రిషు కల
౫౧
యన్తో ధ్వజే శక్రప్రా
షణ్ముఖే చ నా,
యన్తీ పతాకాయాం
రీ కేశవస్రజో౽. ౫౨
కృతి ర్నిరాసే స్త్రీ
ధ్యయరహితే త్రిషు,
రే త్రిష్వవ
సమాప్తేనిశ్చితే౽పిచ.

తోఁగూడిన పున్నమకును పేరు.

ఋశ్యప్రోక్తా - ॥స్త్రీ॥ ఇది దురదగొండికిని, చల్లగడ్డకును పేరు.

అభిశస్తిః-॥స్త్రీ॥ ఇది దూషణకును, యాచనకును బేరు.

సముద్రాంతా-॥స్త్రీ॥ ఇది తీఁటకసిందకును, ప్రత్తిచెట్టునకును బేరు.

కృష్ణవృంతా-॥స్త్రీ॥ ఇది కలిగొట్టుచెట్టునకును, కారుమినుమునకును బేరు.

ప్రాణిద్యూతమ్-॥న॥ ఇది యుద్ధసామాన్యమునకును, కోడిపందెము మొదలైనవానికిని పేరు.

అత్యాహితమ్-॥న॥ ఇది మిక్కిలిభయమునకును, ప్రాణాశలేని సాహసకర్మకును బేరు.

ఉపాహితః-ఇది అగ్నికిని, ఉత్పాతమునకును బేరగునపుడు, ॥పు॥ మఱియొకపదార్థముతోఁ గూర్పఁబడినదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

ఐరావతః-ఇది ఇంద్రవాహనమైన యేనుఁగునకును, నిమ్మచెట్టునకును, కాకినేరేడునకును బేరైనపుడు ॥పు॥ వంకరలేక దీర్ఘమైన యింద్రధనుస్సునకుఁ బేరైనపుడు ॥న॥

ఐరావతీ-॥స్త్రీ॥ ఇది మెఱుపునకు పేరు.

కలధౌతమ్-ఇది వెండికిని, బంగారమునకును బేరగునపుడు ॥న॥ మధురధ్వనిగలదానికి పేరగునపుడు ॥త్రి॥

వైజయంతః-॥పు॥ ఇది ధ్వజమునకును, ఇంద్రుని మేడకును, కుమారస్వామికిని పేరు.

వైజయంతీ-॥స్త్రీ॥ ఇది టెక్కెమునకును, తక్కిలిచెట్టునకును, విష్ణువుయొక్క పుష్పమాలికకును బేరు.

నిరాకృతిః-ఇది తిరస్కారమునకుఁ బేరగునపుడు ॥స్త్రీ॥ వేదము చదువనివానికిఁ బేరగునపుడు ॥త్రి॥

ఉత్తరే=ఇది మొదలు చెప్పఁగల తాంతశబ్దము లన్నియుం త్రిషు=మూఁడులింగములయందు వర్తించును.

అవసితమ్-॥త్రి॥ ఇది సమాప్తినిపొందినదానికిని,నిశ్చయింప

అవదాత స్సితే పీతే ప్రవ
శుద్ధిమత్యపి,
అన్తర్గతం మధ్యగతే వి
ృతేఽప్య
థ గర్హితే. ౫౮. ముహు
ృష్టేఽపగీతం స్యా
త్పరిక్షిప్తం చ ధిక్కృతే,
ప్రేషితే చా
భిజాతస్తు కులీనన్యాయ్య
ణ్డితాః. ౫౯
అభినీత స్సంస్కృతే చ
న్యాయ్యామర్షవతో రపి,
అధిక్షిప్తస్తు నిహితే భర్త్సి
ప్రేషితేఽపి చ. ౬౦
అపధ్వస్తాః పరిత్యక్త పరి
ూర్ణితనిన్దితాః,
ప్రతిజ్ఞాతే వినిహితే సమా
స్థే సమాహితః. ౬౧
పురస్కృతో రిపుగ్రస్తే
ృకృతేఽగ్రీకృతేఽర్చితే,

ఉపరక్తస్తు దుఃఖార్తేరా
హుగ్రస్తేన్దుసూర్యయోః.
పరిప్రాప్తే పరివృతే జ్ఞాతే
పరిగతం భవేత్,
ఉద్గ్రాహిత ముపన్యస్తే
ంబద్ధే గ్రాహితేఽపిచ. ౬౨
దిగ్ధవృద్ధా వుపచితౌ
నిర్గతేఽపి సముద్గతః,

ఉత్కీర్ణ తనూకృతయో

బడినదానికిని పేరు.

అవదాతః-॥ త్రి ॥ ఇది తెల్లనివస్తువునకును, పచ్చనివస్తువు కును, శ్రేష్ఠమైనదానికిని పరిశుద్ధిగలదానికిని పేరు.

అంతర్గతమ్-॥ త్రి ॥ ఇది మధ్యమును పొందినదానికిని మఱచ బడినదానికిని పేరు.

అపగీతమ్-॥ త్రి ॥ ఇది పలుమాఱుఁజూడఁబడినదానికిని, నింద పఁబడినదానికిని పేరు.

పరిక్షిప్తమ్-॥ త్రి ॥ ఇది ధిక్కరింపఁబడినదానికిని, పంపఁబడి దానికిని పేరు.

అభిజాతః-॥ త్రి ॥ ఇది కులముగలవానికిని, న్యాయవంతునికి పండితునకును పేరు.

అభినీతః-॥ త్రి ॥ లెస్సగాఁజేయఁబడినదానికిని, యోగ్యమై దానికిని, కోపముగలవానికిని పేరు.

అధిక్షిప్తః-॥ త్రి ॥ ఇది ఉంచఁబడినదానికిని, బెదరింపఁబడి వానికిని, పంపఁబడినవానికిని పేరు.

అపధ్వస్తః-॥ త్రి ॥ ఇది విడువఁబడినదానికిని, పొడిచేయఁ బడినదానికిని, నిందింపఁబడినదానికిని పేరు.

సమాహితః-॥ త్రి ॥ ఇది ప్రతిజ్ఞచేయఁబడినదానికిని, లెస్స నుంచఁబడినదానికిని, సమాధియందున్నదానికిని పేరు.

పురస్కృతః-॥ త్రి ॥ ఇది శత్రువుచేతపట్టువడినదానికిని, సీ రింపఁబడినదానికిని, ఎదురుగానుంచఁబడినదానికిని, పూజిం బడినదానికిని పేరు.

ఉపరక్తః-॥ త్రి ॥ ఇది దుఃఖముచేత పీడింపఁబడినదాని రాహువుచేత పట్టుపడిన చంద్రసూర్యులకును పేరు.

పరిగతమ్-॥ త్రి ॥ ఇది అంతటపొందఁబడినదానికిని, చుట్టఁబ దానికిని, తెలియఁబడినదానికిని పేరు.

ఉద్గ్రాహితమ్-॥ త్రి ॥ ఇది ఉపన్యసింపఁబడినదానికిని, క బడినదానికిని, గ్రహింపఁజేయఁబడినదానికిని పేరు.

ఉపచితః-॥ త్రి ॥ ఇది పూయఁబడినదానికిని, వృద్ధునికిని జే

సముద్గతః-॥ త్రి ॥ ఇది బయలువెడలినవానికిని, అపశబ్దముప లేచినవానికిని పేరు.

ఉల్లిఖితమ్-॥ త్రి ॥ ఇది గీఱఁబడినదానికిని, సూక్ష్మముగాఁజే

ఖితం
ణిహితంతు విన్యస్తే,
తేఽ
పరిస్ఖలితే ప్రతిరుద్ధే
తిహతం ద్విష్టే.
ఇతి తాన్తాః.

---

నప్రస్థో మధుష్ఠీలే తృ
మా శ్రమవర్తిని. ౬౧.
ుకే
ప్రాణనాథ స్తు యమే
ణేశ్వరేఽపి చ,
నీకస్థో రాజరక్షీ గజ
ణదక్షిణః. ౬౨
తుష్పథం చతుర్మార్గ
మే బ్రాహ్మణే తు నా,
శమీస్థో నష్టబీజే స్థవి
చ త్రిలిఙ్గకః. ౬౩
ఇతి థాన్తాః.

---

చక్రపాదౌ రథగజౌ
వహ్ని ర్దర్కా స్తమో
దః,
కురువిందాః పద్మరాగ హి
ళాదర్శముస్తకాః. ౬౪
జనే గ్రామే జనపదోఽ
పవాదో గర్హణాజ్ఞయోః,
పరీవాద స్తు నిర్వాదే వీ
వాదనసాధనే. ౬౫
అభిష్యన్దో నేత్రరోగేఽ
వృభిమర్దో రణేఽపి చ,

బడినదానికిని పేరు.

ప్రణిహితమ్-॥త్రి॥ ఇది ఉంచఁబడినదానికిని, ధ్యానము చేయఁబడినదానికిని పేరు.

ప్రతిహతమ్-॥త్రి॥ ఇది జాఱినవానికిని, అడ్డగింపఁబడినదానికిని, ద్వేషింపఁబడినదానికిని పేరు.

తాంతపదవర్గము ముగిసెను.

---

వానప్రస్థః-॥పు॥ ఇది సిరిప్పమ్రానికిని, తృతీయాశ్రమమున నున్నవానికిని, మోదుగచెట్టునకును పేరు.

ప్రాణనాథః-॥పు॥ ఇది యమునికిని, ప్రాణేశ్వరునికిని పేరు.

అనీకస్థః-॥పు॥ ఇది రాజుయొక్క యంగరక్షకునికిని, ఏనుఁగుల రక్షింప సమర్థునికిని పేరు.

చతుష్పథమ్-ఇది నాలుగు త్రోవలుగూడు స్థలమునకు పేరగునపుడు ॥న॥ బ్రాహ్మణునకును పేరగునపుడు ॥పు॥

దశమీస్థః-॥త్రి॥ ఇది వీర్యమునశించినవానికిని, వృద్ధునికిని పేరు.

థాంతపదవర్గము ముగిసెను.

---

చక్రపాదః-॥పు॥ ఇది రథమునకును, గజమునకును పేరు.

తమోనుత్-॥ద-పు॥ ఇది అగ్నికిని, చంద్రునికిని, సూర్యునికిని పేరు.

కురువిందః-॥పు॥ ఇది కెంపునకును, ఇంగువకును, అద్దమునకును, తుంగగడ్డకును పేరు.

జనపదః-॥పు॥ ఇది జనమునకును, గ్రామమునకును పేరు.

అపవాదః-॥పు॥ ఇది నిందకును, ఆజ్ఞకును నామము.

పరీవాదః-॥పు॥ ఇది నిందకును, వీణనువాయించుకోడుపునకును నామము.

అభిష్యందః-॥పు॥ ఇది నేత్రరోగమునకును, అపిశబ్దమువలన నంతటజాఱుటకును నామము.

అభిమర్దః-॥పు॥ ఇది యుద్ధమునకును, అపిశబ్దముచేత మర్దిం [చుటకును నామము.

అజమోదా తూగ్రగన్ధా
నిర్యాస శ్ఛల్లకోఽపి చ.
భవే త్కోకనదం రక్త
పద్మే రక్తోత్పలేఽప్య
థ, శరభే నా హేమ్ని
శారిఫలకే ఽష్టాపదోఽ స్త్రి
యామ్. ౬౭

గఙ్గా విష్ణుపదీ క్లీబే త్వ
యం వ్యోమ సముద్రయోః,
అథ ప్రగల్భవిదుషో ర్వా
చ్యలిఙ్గో విశారదః. ౬౮

ఇతి దాన్తాః.

---

దోషోత్పాదేఽనుబన్ధ
స్స్యా త్ప్రకృత స్యానువ
ర్తనే, ప్రకృత్యాదే ర్వినశ్వ
రాంశే శిశౌ ముఖ్యాను
యాయిని. ౬౯

అవరోధో రాజగృహే
శుద్ధాన్తేఽప్యవరోధనే,
భవే దతివిషా శుణ్ఠీ లశు
నేషు మహౌషధమ్. ౭౦

అనిరుద్ధ ఉషానాథే చరే
నాఽనర్గళే త్రిషు,
వసాజమోదయో రుగ్ర
గన్ధా స్త్రీ లశునే తు నా.
ఉపలబ్ధి స్త్రియాం ప్రా
ప్తౌ మనీషాయా

మథ త్రిషు, అవష్టబ్ధం
స్యా దదూరే సమాక్రాన్తే
ఽవలమ్బనే. ౭౧

సమున్నద్ధో స్సముద్బద్ధ

అజమోదా-॥స్త్రీ॥ ఇది ఓమమునకును, బూరుగుచెట్టుఁ కును నామము.

కోకనదమ్-॥న॥ ఇది ఎఱ్ఱకమలములకును, ఎఱ్ఱకలువక నామము.

అష్టాపదః-॥పు॥ ఇది శరభమృగమునకును, బంగారమును, జూదమాడుపలకకును నామము.

విష్ణుపదీ-ఇది గంగకుఁ బేరగునపుడు ॥స్త్రీ॥ ఆకాశమునకు సముద్రమునకును బేరగునపుడు-విష్ణుపదమ్ ॥న॥

విశారదః-ఇది ప్రౌఢునకును, విద్వాంసునికిని పేరగునపు విశేష్యలింగము.

దాంతపదవర్గము ముగిసెను.

---

అనుబంధః-॥పు॥ ఇది దోషమును సంపాదించుటకును, ప్రకృతమైనది యెడతెగక యనువర్తించుటకును, ప్రకృతిప్రత్యయ దులయందు నశించిపోవు నక్షరమునకును, శిశువునకును, ముఖ్యులైన తండ్రి మొదలైనవారి ననుసరించినవానికిని నామము.

అవరోధః-॥పు॥ ఇది రాజగృహమునకును, అంతఃపురమునకును, నిరోధించుటకును నామము.

మహౌషధమ్-॥న॥ ఇది అతివసకును, శొంఠికిని, వెల్లు గడ్డకును నామము.

అనిరుద్ధః-ఇది అనిరుద్ధునికిని, వేగులవానికిని బేరగునపు ॥పు॥ అడ్డములేనిదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

ఉగ్రగంధా-ఇది వసకును, ఓమమునకును బేరగునపుడు ॥స్త్రీ॥ వెల్లుల్లికిఁ బేరగునపుడు ॥పు॥

ఉపలబ్ధిః-॥స్త్రీ॥ ఇది పొందుటకును, బుద్ధికిని నామము.

అవష్టబ్ధమ్-॥త్రి॥ ఇది సమీపమైనదానికిని, ఆక్రమింపఁబడినదానికిని, పట్టునకును నామము.

సమున్నద్ధః॥త్రి॥ ఇది పుట్టినదానికిని, పండితుఁడు నాకఁ

| | |
|---|---|
| పణ్డితంమన్య గర్వితౌ, | తాను పండితుఁడని తలఁచువానికిని, గర్వముగలవానికిని పేరు. |
| ఇతి ధాంతాః. | ధాంతపదవర్గము ముగిసెను. |
| స్యా ద్వర్ధమాన వీరణ్డే శరావే భూషణేఽపిచ. ౭౩ | వర్ధమానః-॥పు॥ ఇది ఆముదపుచెట్టునకును, మూఁకుడునకును, భూషణవిశేషమునకును నామము. |
| అభిమానో గర్వబుద్ధ్యో ర్హింసా ప్రణయయోరపి, | అభిమానః - ॥పు॥ ఇది ధనాదులచేతఁ గలిగినగర్వమునకును, బుద్ధికిని, హింసకును, ప్రార్థనకును నామము. |
| ప్రతియత్నస్తు సంస్కార ఉపగ్రహణలిప్సయోః ౭౪ | ప్రతియత్నః-॥పు॥ ఇది సంస్కరించుటకును, చెఱపట్టుటకును, అభిలాషకును నామము. |
| పారావతే మయూరేచ కోకిలే చ కలధ్వనిః, | కలధ్వనిః-॥పు॥ ఇది పావురమునకును, నెమలికిని, కోకిలకును నామము. |
| ధాతృస్మరా దాత్మయోనీ | ఆత్మయోనిః-॥పు॥ ఇది బ్రహ్మకును, మన్మథునికిని పేరు. |
| మూర్ఖనీచౌ పృథగ్జనౌ. | పృథగ్జనః ॥పు॥ ఇది మూర్ఖునకును, నీచునకును నామము. |
| జన్మభూమా వభిజనో విఖ్యాతా వన్వయే చ సః, | అభిజనః-॥పు॥ ఇది జన్మభూమికిని, ప్రసిద్ధికిని, కులమునకును చకారమువలన కులాగతములైన ధ్వజాదులకును నామము. |
| వహ్నౌ భానౌ చిత్రభానూ | చిత్రభానుః-॥పు॥ ఇది అగ్నికిని, సూర్యునకును నామము. |
| వహ్నీన్ద్వర్కా విరోచనాః. ౭౫ | విరోచనః - ॥పు॥ ఇది అగ్నికిని, చంద్రునకును, సూర్యునకును నామము. |
| పుణ్యజన స్సుజనే స్యా ద్రక్షసి యక్షేఽ | పుణ్యజనః - ॥పు॥ ఇది సుజనునికిని, రాక్షసునకును, యక్షునకును నామము. |
| థ గర్జితే మేఘే, స్తనయిత్ను | స్తనయిత్నుః - ॥పు॥ ఇది గర్జనమునకును, మేఘమునకును నామము. |
| రనూచాన స్సువినీతే సాఙ్గవేదజ్ఞే. ౭౬ | అనూచానః-॥పు॥ ఇది మిక్కిలి వినయవంతునికిని, వ్యాకరణాదిషడంగములతోఁడ వేదములఁ జదివినవానికిని నామము. |
| గుఞ్జాయామాథ్యా శిఖండిన్యా | శిఖండినీ - ॥స్త్రీ॥ ఇది గురిగింజకును, అడవిమొల్లకును పేరు. |
| సౌదామ న్యప్సరస్యపి, | సౌదామనీ-॥స్త్రీ॥ ఇది అప్సరసకును, అపిశబ్దముచేత మెఱుపు[కును నామము |
| ఆతఞ్చనం ప్రతీవాప జవనాప్యాయనార్థకమ్ ౭౭ | ఆతంచనమ్-॥న॥ ఇది పాలుతోడుపెట్టుటకును, వేగమునకును, తృప్తిని గలుగఁజేయుటకును పేరు. |
| సాధనే తోషణే ప్రాప్తావారాధన | ఆరాధనమ్ - ॥న॥ ఇది సాధనమునకును, సంతోషపెట్టుటకును, పొందుటకును పేరు. |

మ థాంశుకే, పిధానే౽
ప్యాచ్ఛాదనం స్యా
త్కార్య హేత్వోః ప్ర
యోజనమ్. ౭౯
ఆస్కన్దనం తిరస్కారే
శోషణయో ర్యుధి,
ప్రతిమానం ప్రతిచ్ఛాయా
జదంతాన్తరాళయోః.
౮౦
అనుష్ఠానం పుః ప్రభావ
క్రే ష్వధ్యాసనే౽పి చ,
న్మోద్గత్యో రుత్పతన
మథాభివ్యాప్తి మూర్ఛ
నాః. ౮౧ సమ్మూర్ఛనం
ముత్థాన ముద్యమే రోగ
యే,
ర్యాతనం వైరశుద్ధౌ దా
న్యాసధనార్పణే. ౮౨
కాంక్షాయా మాకలనం
నా జ్ఞాన బన్ధయోః, స
హే చా
దానం తు వృత్తకర్మణి
నే. ౮౩
ర్భర్త్సన మలక్ష్మే౽పి
తిదృష్ట్యో ర్నిశామనమ్,
పాసనం శరాభ్యాసే
సా సేవనయో రపి. ౮౪
తే కంపే నిధువనమ్
శ్యే దుద్వర్తన ముద్గమే,
పనే
థ వధే సమాప్తౌ చ స
నమ్. ౮౫

ఆచ్ఛాదనమ్-॥న॥ ఇది వస్త్రమునకును, కప్పుటకును

ప్రయోజనమ్-॥న॥ ఇది కార్యమునకును, హేతువునకు

ఆస్కందనమ్ - ॥న॥ ఇది తిరస్కారమునకును, గః
కును, ఎండుటకును, యుద్ధమునకును పేరు.

ప్రతిమానమ్ - ॥న॥ ఇది దేవతామూర్తులకు సమము
దులచేఁ జేయఁబడిన విగ్రహాదులకును, ఏనుఁగుదంతమ
దేశమునకును పేరు.

అనుష్ఠానమ్-॥న॥ ఇది పట్టణమునకును, ప్రభావము
బండికంటికిని, ఆక్రమించుటకును పేరు.

ఉత్పతనమ్-॥న॥ ఇది పుట్టుటకును, ఎగురుటకును పే

సమ్మూర్ఛనమ్-॥న॥ ఇది అంతట వ్యాపించుటకును,
మఱచుటకును పేరు.

సముత్థానమ్-॥న॥ ఇది ఉద్యోగమునకును, రోగనిశ్చ
నకును పేరు.

నిర్యాతనమ్-॥న॥ ఇది పగసాధించుటకును, దానము
దాఁచిపెట్టినధనమును మరలనిచ్చుటకును పేరు.

ఆకలనమ్-॥న॥ ఇది ఆక్షేపమునకును, లెక్కపెట్టు
నకును, కట్టుటకును, కూటమికిని పేరు.

అపదానమ్-॥న॥ ఇది పూర్వము నడిచిన సద్వ్యాపా
నకును, ఖండించుటకును పేరు. [టకును

నిర్భర్త్సనమ్-॥న॥ ఇది లక్కకును, అపశబ్దముచే బె

నిశామనమ్-॥న॥ ఇది వినుటకును, చూచుటకును పేరు

ఉపాసనమ్ - ॥న॥ ఇది విలువిద్య నేర్చుకొనుటకును,
పుటకును, సేవచేయుటకును పేరు.

నిధువనమ్-॥న॥ ఇది రతికిని, వణఁకుటకును పేరు.

ఉద్వర్తనమ్ - ॥న॥ ఇది తెచ్చుటకును, నలుగుపెట్టు
పేరు.

సమాపనమ్-॥న॥ ఇది వధకును, సమాప్తికిని పేరు.

ఆమ్నాయేఽపి ప్రవచనం
స్యా దాయోధన మాహవే, వధే చ
ప్రణిధానం తు సమాధి ప్రతియత్నయోః. ౧౭
యోన్యుత్పత్త్యోః ప్రజనన మథ ప్రేషణదానయోః, విసర్జనం
విహననం వధవీజనవాచకమ్. ౧౮
అభ్యాధాన మభిన్యాసీ వహ్న్యర్థం చేధ్మసఙ్గ్రహే,
నిర్వాసనంతుహింసాయాం నగరాదే ర్బహిష్కృతౌ.
నిర్భర్త్స్యాతౌ చ నిరసనం
సంవాహన మఙ్గమర్దనేఽపి స్యాత్,
శిల్పగ్రహే ప్యావేశన ముద్యాపనమపి చ హింసనే ప్రోక్తమ్. ౧౯
కాత్యాయనో వరరుచౌ మునౌ కాత్యాయనీత్యుమా, యా చార్ధవృద్ధా కాషాయవసనా గత భర్తృకా. ౨౦
త్రి ష్వవలగ్నం లగ్నే మధ్యే క్లీబం
ఘనాఘన స్త్రివ్రన్ద్రే, వర్షుకమేఘే ఘాతుకమత్తేభేచ త్రిషు త్వయం సాన్ద్రే. ౨౧

ప్రవచనమ్—॥న॥ ఇది పలుమారు చదువుటకును, అపిశబ్దము చేత శ్రేష్ఠవాక్యమునకును పేరు.

ఆయోధనమ్–॥న॥ ఇది యుద్ధమునకును, చంపుటకును పేరు.

ప్రణిధానమ్–॥న॥ ఇది సమాధికిని, అభిలాషకును పేరు.

ప్రజననమ్–॥న॥ ఇది యోనికిని, ఉత్పత్తికిని పేరు.

విసర్జనమ్–॥న॥ ఇది పంపుటకును, దానమునకును పేరు.

విహననమ్–॥న॥ ఇది వధకును, విసరుటకును పేరు.

అభ్యాధానమ్–॥న॥ ఇది ఉంచుటకును, అగ్నికొఱకు సమిత్తుల సంపాదించుటకును పేరు.

నిర్వాసనమ్–॥న॥ ఇది హింసకును, పట్టణము మొదలైనవాని నుండి వెడలఁగొట్టుటకును పేరు.

నిరసనమ్–॥న॥ ఇది ఉమియుటకును, చకారము చేత ధిక్కరించుటకును పేరు.

సంవాహనమ్–॥న॥ ఇది దేహమును పిసుకుటకును, అపిశబ్దమ చేత మోయుటకును పేరు. [గుడిసెకును పేరు

ఆవేశనమ్–॥న॥ ఇది కంసాలకొట్టునకును, అపిశబ్దముచే

ఉద్యాపనమ్ – ॥న॥ ఇది హింసించుటకును, అపిశబ్దముచే నొకబింబమున నావాహనము చేసిన దేవతను మరల స్వస్థానమునకు మంత్రముచేత పంపుటకును పేరు.

కాత్యాయనః–॥పు॥ ఇది వరరుచికిని, కాత్యాయనముని పేరు. కాత్యాయనీ ॥స్త్రీ॥ పార్వతికిని, సగముముదిసి కావిచీరగట్టుకొనియున్న విధవస్త్రీకిని పేరు.

అవలగ్నమ్–ఇది చిక్కుపడినదానికిఁ బేరైనపుడు ॥త్రి॥ నడుమునకుఁ బేరైనపుడు ॥న॥

ఘనాఘనః–ఇది ఇంద్రునకును, వర్షించుమేఘమునకు చంపుస్వభావముగల మదపుటేనుఁగునకును బేరైనపుడు దట్టమైనదానికి పేరైనపుడు ॥త్రి॥

శాశ్వతే త్రిషు నా బ్రహ్మ
-రీశేషు సనాతనః,
దీప్తౌ ప్రద్యోతనం నార్కే
మహాసేనో గుహోఽపిచ. ౯౨
ఆత్మనీన స్సుతే స్యాలే
మా నాత్మహితే త్రిషు,
విష్వక్సేనా గన్ధఫల్యాం
-తు విష్ణౌ
వథ త్రిషు. ౯౩. అభిప
...ధృతే గ్రస్తేఽపరాద్ధే
...ణార్తయోః, విపన్నే
ప్రతిపన్నస్తు విజ్ఞానేఽఙ్గీ
తావపి. ౯౪
అవాచీనం విపర్యస్తం య
దక్షిణదిగ్భవమ్,
ఇతి నాన్తాః.

---

ప్రలమ్భే విరోధోక్తావ
ర్థకవచస్యపి. ౯౫. వి
లాపోఽ
లేపస్తు దూషణే గర్వ
యోః,
రివాదస్తు పర్యస్తౌ వాల
రే పరిచ్ఛదే. ౯౬
రిక్షేపః పరివృత్తౌ పాద
ర్శ్వే చ దన్తినామ్,
పతాపౌ రోగతాపౌ
విష్ణౌ వృషాకపీ. ౯౭
ఇతి పాన్తాః.

---

సనాతనః-ఇది నాశములేనిదానికి పేరైనపుడు ॥త్రి॥ బ్రహ్మకును, విష్ణువునకును, శివునికిని పేరైనపుడు ॥పు॥

ప్రద్యోతనమ్-ఇది ప్రకాశమునకు పేరైనపుడు ॥న॥ సూర్యునికిని పేరైనపుడు ॥పు॥

మహాసేనః - ॥పు॥ ఇది కుమారస్వామికి పేరు. అపిచ కారములవలన సేనావిస్తారముగలవానికి పేరైనపుడు ॥త్రి॥

ఆత్మనీనః - ఇది కుమారునికిని, భార్యతోఁడఁబుట్టినవానికిని పేరైనపుడు ॥పు॥ ఆత్మహితమైనదానికిని పేరైనపుడు ॥త్రి॥

విష్వక్సేనా-॥న॥ ఇది ప్రేంకణపుచెట్టునకుఁ బేరైనపుడు ॥సీ॥ విష్ణువునకుఁ బేరైనపుడు ॥పు॥

అభిపన్నః-॥త్రి॥ ఇది ధరింపఁబడినదానికిని, పట్టువడినదానికిని, అపరాధము చేసినవానికిని, సమర్థునికిని, ఆర్తునికిని, ఆపద పొందినవానికిని పేరు.

ప్రతిపన్నః-॥త్రి॥ ఇది శిల్పశాస్త్రాదులయందలి జ్ఞానమునకును, అంగీకారమునకును పేరు.

అవాచీనమ్-॥త్రి॥ ఇది విపర్యాసమైనదానికిని, దక్షిణదిక్కునఁ బుట్టినదానికిని పేరు.

నాంతపదవర్గము ముగిసెను.

---

విప్రలాపః-॥పు॥ ఇది మోసపుచ్చుటకును, విరోధవాక్కునకును, వ్యర్థవాక్కునకును పేరు.

అవలేపః-॥పు॥ ఇది దూషించుటకును,గర్వమునకును, పూయుటకును పేరు.

పరివాదః-॥పు॥ ఇది వ్యథపెట్టుటకును, నీళ్లునిలుచుపాదికిని, పరివారమునకును పేరు.

పరిక్షేపః-॥పు॥ ఇది వెలుగునకును, ఏనుఁగులయొక్క పాద పార్శ్వమునకును పేరు.

ఉపతాపః-॥పు॥ ఇది రోగమునకును, సంతాపమునకును పేరు.

వృషాకపిః-॥పు॥ ఇది శివునికిని, విష్ణువునకును పేరు.

పాంతపదవర్గము ముగిసెను.

| | |
|---|---|
| ష్యాభేదే రాజజమ్బ్వాః | రాజజంబూః-॥స్త్రీ॥ ఇది నేరేడుయొక్క భేదమునకును, ముద్ద |
| ర్జూరకేఽపి సా, | ఖర్జూరమునకును పేరు. |
| ఇతి బాన్తాః. | బాంతపదవర్గము ముగిసెను. |
| వష్టమ్భ స్తమ్భ తాయాం | అవష్టంభః-॥పు॥ ఇది స్తబ్ధభావమునకును, బంగారమునకును, |
| మ్ని గర్వేఽవలేపనే. | గర్వమునకును, పూయుటకును పేరు. |
| ఇతి భాన్తాః. | భాంతపదవర్గము ముగిసెను. |
| భ్యాగ మోభ్యాగమనే | అభ్యాగమః-॥పు॥ ఇది వయ్చుటకును, యుద్ధమునకును, సమీ |
| త్సఙ్గర సమీపయోః, | పమునకును పేరు. |
| ార్వభౌమ స్సర్వపృథ్వీ | సార్వభౌమః-॥పు॥ ఇది సమస్తభూమ్యాధిపతికిని, ఉత్తర |
| ుకే దిగ్గజాన్తరే. ౯౯ | దిక్కునుండు దిగ్గజమునకును పేరు. |
| పక్రమ స్స్యా దుపధా | ఉపక్రమః - ॥పు॥ ఇది అమాత్యాదులం బరీక్షించుటకును, |
| త్సారమ్భవాచకః, | వైద్యమునకును, ఆరంభమునకును పేరు. |
| హాపద్మో నాగభేదే నిధి | మహాపద్మః-॥పు॥ ఇది సర్పభేదమునకును, నిధివిశేషమున |
| ఖ్యావిశేషయోః. ౧౦౦ | కును, సంఖ్యాభేదమునకును పేరు. |
| శ్వకర్మా సహస్రాంశౌ దేవ | విశ్వకర్మా ॥న్-పు॥ ఇది సూర్యునకును, దేవతలశిల్పికిని |
| ్ని వేధసి, | బ్రహ్మకును పేరు. |
| ాత ప్రమీర్మృగేఽశ్వేఽ | వాతప్రమీః-॥పు॥ ఇది పొడలయిఱ్ఱికిని, గుఱ్ఱమునకును పేరు |
| శౌర్యోద్యోగౌ పరాక్ర | పరాక్రమః-॥పు॥ ఇది భయకారణముగలిగినను భయపడక |
| . ౧౦౧ | నుండుటకును, కార్యారంభమునకును పేరు. |
| ంగీకృతా వుపగమస్సమీ | ఉపగమః - ॥పు॥ ఇది అంగీకారమునకును, దాపును జెందుట |
| మనేఽపి చ, | కును పేరు. |
| ్యేష్ఠభ్రాత ర్యగ్రజన్మా | అగ్రజన్మా ॥న్-పు॥ ఇది అన్నకును, బ్రాహ్మణునికిని పేరు. |
| ్హ్మణే చాప్యథ త్రిషు. | |
| యాతయామం గతరసే | యాతయామమ్-॥త్రి॥ ఇది పోయినరుచిగలదానికిని, చ |
| ్ణే భుక్తోజ్ఝితేఽపి చ, | కినదానికిని, అనుభవించి విడువబడినదానికిని పేరు. |
| ఇతి మాన్తాః. | మాంతపదవర్గము ముగిసెను. |
| హాలీన్దుజౌ రౌహిణేయౌ | రౌహిణేయః-॥పు॥ ఇది బలరామునికిని, బుధునకును పేరు. |
| ల్లసింహౌ గుహాశయౌ. | గుహాశయః-॥పు॥ ఇది యెలుగుబంటికిని, సింహమునకు |
| ౧౦౨ | పేరు. |

దీర్ఘద్వేషేఽప్యనుశయః
పశ్చాత్తాపానుబన్ధయోః,
సముదాయ స్సముదయో
ద్వావిమౌ వృద్ధిబృన్దయోః.
బాహులేయో వృషే
స్కన్దే
బాడబేయో ద్విజాశ్వయోః,
సమాహ్వయో నామ్ని
యుద్ధే ద్యూతే చ పశుప
క్షిభిః. ౧౦౫
స్థూలోచ్చయ స్త్వసాక
ల్యే దన్తినాం మధ్యమే గతౌ,
ధనఞ్జయోఽర్జునే శక్రే ద
హనే దేహమారుతే. ౧౦౬
సముచ్ఛ్రియ స్స్యదుత్సే
ధే విరోధేఽపి
ప్రతిశ్రయః, సభాయాం
చాశ్రయే చా
ఽవశ్యాయో హిమగర్వ
యోః. ౧౦౭
సామ్పరాయ స్తు సమరే
విప దాగామికాలయోః,
అన్తశయ్యా శ్మశానే చ
సా శయ్యాయాం మృతా
వపి. ౧౦౮
గౌర్యశ్విన్యో దక్షకన్యే
మదిరాఽపి హలిప్రియా,
అన్వాహార్యం భవే న్మాస
శ్రాద్ధ మిష్టేశ్చ దక్షిణా.
భాగే భాగ్యే భాగధే
యం దాయాదే తు పుమా

అనుశయః-॥పు॥ ఇది దీర్ఘద్వేషమునకును, పశ్చాత్తాప
మునకును, అనువర్తించుటకును పేరు.

సముదాయః-సముదయః ॥పు॥ ఈ రెండును వృద్ధికిని, గ
నకును పేళ్లు.

బాహులేయః - ॥పు॥ ఇది ఎద్దునకును, కుమారస్వామి
పేరు.

బాడబేయః-॥పు॥ ఇది బ్రాహ్మణునికిని, గుఱ్ఱమునకును పే

సమాహ్వయః-॥పు॥ ఇది నామధేయమునకును, యుద్ధమ
కును, పొట్టేలు, కోడి మొదలైన వానిచే నాడు జూదమ
కును పేరు.

స్థూలోచ్చయః-॥పు॥ ఇది సంపూర్ణముగాకయుండుటకు
యేనుఁగులయొక్క తీవ్రము మందముగానినడకకును పేరు.

ధనంజయః-॥పు॥ఇది అర్జునునకును,ఇంద్రునకును, అగ్నికిని,
ముపోయినతర్వాతగూడ దేహమునువదలనివాయువునకును పే

సముచ్ఛ్రియః - ॥పు॥ ఇది పొడవునకును, విరోధమునకు
పేరు.

ప్రతిశ్రయః-॥పు॥ ఇది సభకును, ఆశ్రయమునకును పే

అవశ్యాయః-॥పు॥ ఇది మంచునకును, గర్వమునకును పేర

సాంపరాయః-॥పు॥ ఇది యుద్ధమునకును, ఆపదకును, భ
వ్యత్కాలమునకును పేరు.

అంతశయ్యా-॥స్త్రీ॥ ఇది శ్మశానమునకును, మంచముమీఁ
మరణమునకును పేరు.

దక్షకన్యా-॥స్త్రీ॥ ఇది గౌరికిని, అశ్వినీనక్షత్రమునకును పేరు.

హలిప్రియా-॥స్త్రీ॥ ఇది మద్యమునకును, అపిశబ్దముచేత రేవ
తీదేవికిని పేరు.

అన్వాహార్యమ్-॥న॥ ఇది మాసశ్రాద్ధమునకును, ఇష్టియందుం
చుదక్షిణకును పేరు.

భాగధేయమ్-ఇది భాగమునకును, పూర్వకృతమైనశుభకర్మ
ఫలమునకును పేరగునపుడు ॥న॥ ఇది భాగార్హుడైన దాయాదు

